# విదురనియోపదేశములు

శ్రీ కేతవరపు వేంకటశాస్త్రి

Approved by the Madras Text Book Committee
for Class use.



ప్రొప్రయిటర్సు: అడ్డేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము



సరస్వతీ గ్రంథమండలి:
అనుబంధ మాలిక ౪

# విదురునియుపదేశములు

శ్రీ కేతవరపు వేంకటశాస్త్రి

Approved by the Madras Text Book Committee
for Class use.




పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పేపర్ ప్రెస్
రాజమహేంద్రవరము

## ఉపోద్ఘాతము

శ్రీమహాభారతమున సుప్రసిద్ధిఁ గాంచిన మహావీరులలో విదురుఁ డొక్కఁడని చెప్పవలసియున్నది. అతఁడు బాహు బలమున భీష్మునికెనయగును; వింట ద్రోణాచార్యుల కీడగును; ధర్మగుణమున ధర్మరాజున కుద్ది యగును; దైవభక్తికిఁ బ్రహ్లాదాదులకు తుల యగును; జ్ఞానమున వ్యాసాదిఋషులకు సాటి యగును. ఇట్టి యసాధారణగుణముల కతఁ డాధారుఁ డనుటకు సందియ మింతయును లేదు. మఱియు నతఁడు సాధుస్వభావము గలవాఁడు; న్యాయమార్గమునం దాసక్తి గలవాఁడు; సజ్జనప్రియుఁడు; పెద్దలయెడ నధికారముగలవాఁడు; ధర్మనిర్ణయముచేయునెడ మోమోట నింతయునులేక పలుకు వాఁడు; మిక్కిలి దూరాలోచనపరుఁడు; పరులకు హిత ముపదేశించుపట్టున జంకును గొంకును లేనివాఁడు.

పైని పేర్కొన్న యుత్తమగుణములు విదురుని చరిత్రమునం దంతటను నెలకొని యున్నవి. ఆ యుత్తముని చరిత్రము సామాన్యముగా నందఱకు నాదర్శప్రాయ మన్న నతిశయోక్తి కాదు. పంచమవేదమని ప్రసిద్ధిఁగాంచిన భారతమునం దీ మహామహునిచరిత్ర యచ్చటచ్చట వర్ణింపఁబడుటచే నంతయు నొక్కమాఱు చదువుకొని యానందించు భాగ్యము మనకు లేకపోయినది. చదువరుల కట్టి సౌలభ్యము గల్గించుటకై నే నా విదురుని చరిత్రమును నా బుద్ధి కలవడినంతవఱకు నిటఁ బొందుపఱచుచున్నాను.

---



## విదురుని జననము

భారతవంశవర్ధనుఁడగు వ్యాసుని యంశమువలన విదురుఁడు జన్మించెను. ధృతరాష్ట్ర పాండురాజులవలె నితఁడును వ్యాస మహర్షి కుమారుఁడు. ఇతఁడు దాసియం దుద్భవించినను దక్కిన రాజకుమారులవలె నాహార విహారములందు సమాదరింపఁ బడుచుండెను. భీష్మాది కులవృద్ధులును, సత్యవతి మొదలగు నంతఃపురస్త్రీలును విదురుని నధిక ప్రేమతోఁ జూచి పోషించు చుండిరి. చిన్నతనమునుండియు నితని సద్గుణములు దక్కినవారి మానసముల నాకర్షించుచుండెను. ఇతఁడు కులవృద్ధుల యొద్దను, దనసహోదరులగు ధృతరాష్ట్ర పాండురాజులయొద్దను, మిక్కిలి వినయముతోను, భక్తితోను వర్తించి వారిని గౌరవించి వారి వలన గౌరవ మందుచుండెను. ఇతఁడు ధృతరాష్ట్ర పాండు రాజులకంటెఁ జిన్న యయ్యు, బుద్ధియందును, సుగుణము లందును బెద్దయై కులవృద్ధయిన భీష్మునకుఁగూడఁ గార్యా లోచనముఁ జెప్పుచుండెను. భీష్ముఁడుగూడ సర్వకార్యము లందు నితని యాలోచనమును గైకొనుచుండెను. భీష్మునివంటి మహనీయుఁడుగూడఁ గార్యములపట్ల విదురునితో నాలోచించు చుండునని చెప్పుటవలననే యితని మహత్త్వము లోకమునకు వెల్లడి కాకమానదు. చిన్నవాఁడయ్యును విదురుఁ డింతటి యుత్తమపురుషుఁడని యాశ్చర్యపడ నవసరములేదు. ఇతఁడు కేవలము యమధర్మరాజు. ఆ ధర్మరాజే శాపవశమున భూమిలో

శూద్రస్త్రీయం దుదయించెను. అట్టి ధర్మావతార మగుట విదురుం డంతటిగుణవంతుఁ డయ్యెను. యమధర్మరా జట్లు భూమిపై నవతరించుట కేమికారణమో యిటఁ గొంచెము వివరించెదను.

మాండవ్యుఁడు యముని శపించుట

పూర్వము మాండవ్యుఁ డను బ్రహ్మర్షి గలఁడు. అతఁడు సదాచారసంపన్నుఁడయి మిక్కిలి వాసిగాంచెను. అతఁడు తీర్థయాత్రాపరుఁడయి శ్రమయనక శీతాతపములకు వెను దీయక భూవలయంబునఁగల సకలతీర్థములను సేవించి మిక్కిలి పుణ్య మార్జించికొనెను. పిమ్మట నతఁడు సర్వసంగములను బరిత్యజించి యొకానొక నగరమునకుఁ గొంతదూరమం దున్న యడవిలోఁ బ్రవేశించి యచ్చట నొకయాశ్రమమును గల్పించి కొనెను. పిమ్మట నతఁడు తనయాశ్రమద్వారంబున నున్న వృక్షమూలమునఁ గూర్చుండి యూర్ధ్వబాహుఁడై మౌనవ్రత మవలంబించి తపము సేయ నారంభించెను.

ఇట్లుండ నొకనాఁడు కొందఱుదొంగలు రాజుగారి ధన మపహరించి పలాయితు లగుచుండిరి. రాజభటులు జరిగిన ప్రమాదమును వెంటనే తెలిసికొని దొంగలజాడ లరయ నలుదెసలఁ గలయవెదకి తుదకాదొంగలను వెంబడించిరి. ఆ తస్కరులు తమ్ము వెనుకొని వచ్చుచున్న రాజభటులను గాంచి భయభ్రాంతు లయి తమ్ము రక్షించుకొను నుపాయాంతరము గానక యమ్మాండవ్యుని యాశ్రమమును బ్రవేశించి

యందు దాఁగికొనిరి. అంత రాజభటు లట్లువచ్చి తప మొనర్చు చున్న యమ్మునింగాంచి "మునీంద్రా! ధన మపహరించి దొంగలు నీవైపునకుఁ బర్వెత్తుకొని వచ్చిరి. వా రెటుపోయిరో తెల్పు?" మని యడిగిరి. అమ్ముని మౌనవ్రతుఁ డగుటచే వారికిఁ బ్రత్యుత్తర మీయక యెప్పటియట్లు తప మాచరించు చుండెను. రాజభటు లతని సరకుగొనక యాశ్రమమును బ్రవేశించి ధనముతోఁగూడ దొంగలను బట్టుకొని ముని చెంతకువచ్చి "ఓహో! ఈముని కపటవేషధారి. వీఁడు దొంగలకెల్ల మోసగాఁడు. ధనముతోఁగూడ దొంగలను దన యాశ్రమమున దాఁచి యేమియు నెఱుఁగనట్లు తపముఁ జేయుచున్నాఁడు. వీనినిఁగూడ బంధించి కొనిపోవుద" మని తమలోఁ దా మాలోచించుకొని నీతివిహీనులై యా మ్రుచ్చు లతోఁబాటు మునీంద్రునిఁగూడ బంధించుకొనివచ్చి రాజున కప్పగించిరి. రా జాదొంగలను వెంటనే చంపించి యితఁడును దపోవేషంబున నున్న దొంగయే యని భావించి మాండవ్యుని పురము వెలువల శూలారోపణము చేయించెను.

అట్లు రాజుచే నపకృతుఁ డయ్యును, మాండవ్యుఁడు మన స్సున నతిశాంతుఁ డయి శూలబాధను సహించి యెప్పటి యట్లు తపము చేసికొనుచుండెను. అతఁడు నిరాహారి యయ్యు బహుకాలము జీవించెను. శరీరదుఃఖమును దలంచక దృఢమనస్కుఁడై నిర్మలాత్మతోఁ దప మొనరించు నమ్మునీంద్రుని తపస్సునకు మెచ్చి మహర్షులు కొందఱు

పక్షిరూపములతో రాత్రిసమయమున వచ్చి "మునిశ్రేష్ఠా! యిట్టి మహాతపశ్శాలివగు నీ కీ దుఃఖము గల్గించినవా రెవ్వ?" రని యడిగిన వారికి మాండవ్యుఁ డిట్లనియె.

ఎఱిఁగియెఱిఁగి నన్నడుగంగ నేల దీని
సుఖము దుఃఖంబు ప్రాప్తించుచో నరుండు
తగిలి తనకర్మవశమునఁ దనకుఁదాన
కర్తగా కన్యులకు నేమి కారణంబు?

"మునీంద్రులారా! సర్వము దెలిసియు మీ రీవిషయ మును నన్నడుగ నేల? మానవుఁడు తన కర్మమునకు లోఁబడి సుఖమునుగాని దుఃఖమునుగాని పొందుటలోఁ దాన్నే కర్త యగును. అంతియె కాని పరు లెవ్వరు నందులకు హేతువుగా" రని పలికెను.

మునులతో నా మాండవ్యుఁడు పలికిన వాక్యములను ద న్నగర రక్షకభటులువిని పోయి రాజునకు విన్నవించిరి. రాజు తన తప్పును వెంటనే గ్రహించి పర్వాపర్వాన వచ్చి శూల ప్రాప్తుఁ డయ్యు నిశ్చలమనసుతోఁ దప మొనర్చుచున్న మాండవ్యునిఁ గాంచి నమస్కరించి "యజ్ఞానవశమున నే నొనర్చిన యపరాధమును క్షమించి నాయెడఁ బ్రసన్నుఁడవు క" మ్మని ప్రార్థించెను. మునియు నతనియెడఁ గరుణించెను. రాజు శూలమునుండి మునిని దొలఁగింప యత్నించెను. కాని యాశూల మతనినుండి యూడిరా దయ్యెను. అంతట రాజు దానిని మెల్లగాఁ దునియించి యూడదీయించెను.

కాని తత్కంఠపార్శ్వమున నొక తునుక మిగిలిపోయెను. దానిని దీయ నెవ్వరికిని శక్తి లేకపోయెను. శూలపుఁదునుక శరీరమున నుండుటం జేసి యమ్ముని విముక్తుఁడయి ఘోర తపంబుఁ జేసి మహామహిమను సంపాదించికొని లోకము లందుఁ దిరుగుచు నొకనాఁడు యమలోకమున కరిగి "దండ ధరా! నీవు సర్వమును దెలిసినవాఁడవు. నేను దారుణ దండ నమునకుఁ బాల్పడితిని. అట్లగుటకు నే నేమి దుష్కృత మొనర్చితినో చెప్పుము. నేను బ్రాహ్మణుఁడను. తపశ్శా లిని. నే నట్టిదండనమునకుఁ దగుదునా?" యని పలుక మాండవ్యునకు యముఁ డిట్లనియెను. "మునీంద్రా! నీవు చిన్నతనమునఁ దూనీఁగలను బట్టికొని కొఱ్ఱులఁ బెట్టి బాధించితివి. తత్ఫలము నీ విప్పు డనుభవింపవలసి వచ్చినది. హింసాపరు లగుమానవులు దుఃఖము లొందకుండ నుండఁ గలరా?" అని పలికిన యమునిఁ జూచి మాండవ్యుఁ డతికుపి తుఁడై "ఓయీ! ఏమనుచున్నావు? నేను జిన్నతనమునఁ బాప మొనర్చితి ననియా! అది సరికాదు. పుట్టినది మొదలుకొని పదినాల్గు వత్సరములదనుకఁ బురుషుఁడు బాలుఁ డనిపించుకొనును. అట్టివాఁ డెద్దిచేసినను బాపము లను బొందఁడు. వాని కొరు లెగ్గుచేసి రేని పాతకులగుదురు. ఇది ధర్మశాస్త్ర మర్యాద. ఇట్లుండఁ దెలియక బ్రాహ్మణుఁడ నగు నాకుఁ దగనిదండనమును విధింపఁజేసి నాయెడ నపరాధి వయితివి. కావునఁ దత్ఫల మిప్పు డందుము. నీ వీవైభవమును

విడిచి భూతలమున శూద్రుంస్త్రీయందు జనింపు మని శపించెను. ఆశాపమువలననే ధర్మరాజు విదురుఁడై జన్మించెను. కావుననే విదురుఁ డుత్తమోత్తముఁడయి ధర్మాధర్మపరి శీలననిపుణుఁడయి లోకమున మిక్కిలి వాసిగాంచెను.

విదురుఁడు ధృతరాష్ట్రపాండురాజులతోఁ గూడి చిన్న తనమంతయును బుచ్చెను. యౌవనవంతుఁడు కాఁగానే యతఁడు తనసోదరులవలె గృహస్థాశ్రమమును స్వీకరించెను. అతఁడు దేవకుని కుమారిక యగు పారసవియను యువతిని బెండ్లియాడి తనతో సమానులగు పుత్త్రిలను బడసెను. అతఁడు కుటుంబి యయ్యును బురదలోఁ దిరుగు కుమ్మరిపురుగువలె సక్తుఁడుగాక విషయవిముఖుఁడై వర్తించెను. అతఁ డన్నికార్యములందును భీష్మునకుఁ దోడ్పడుచుఁ గౌరవమంత్రి యని పేరొందెను. ఏకార్యమైనను భీష్ముఁడు విదురునితో నాలోచింపకుండఁ జేయ లేదు. ఈమహానుభావుఁడు వయస్సునఁ బాండునికంటెఁ జిన్న యయ్యును గురుకులవృద్ధు లగు భీష్మాదులతో సమముగా గౌరవింపఁబడుచుండెను. పాండుఁడు దిగ్విజయ మొనర్చి తెచ్చిన ధనంబులు ధృతరాష్ట్రు ననుమతివడసి భీష్మునకును, సత్యవతికిని, దల్లులకు నిచ్చుచున్నట్లు విదురునకుఁగూడ నిచ్చు చుండెనని భారతమువలనఁ దెలియుచున్నది.

విదురుఁడు దూరదృష్టి గలవాఁడు. హిత మొపదేశించునెడ జంకు లేనివాఁడు. ధృతరాష్ట్రునకు గాంధారీదేవియందు దుర్యో ధనుఁ డుదయించెను. ఆసమయమునఁ బెక్కు దుర్నిమిత్తంబులు

పొడమెను. పుత్త్రాభ్యుదయ సంతోషముచే ధృతరాష్ట్రుం డుప్పొంగుచుండ విదురుఁడు భీష్మాదులతో నతని సమీపించి “సోదరా! ఈపుత్త్రజననమున కానందించుచుంటివి. కాని యిది యానందింపఁదగిన సమయముకాదు. ఈపిల్లవాఁడు పుట్టిన సమయమునఁ బెక్కు లుత్పాతములు పొడమినవి.

మన దుర్యోధను జన్మం
బునఁ బెక్కులు దుర్నిమిత్తములు పుట్టె జగ
జ్జనసంక్షయజననుం డగు
నని పలికెద రెఱుకగల మహాత్ములు వానిన్.

కులమునకు నఖిలలోకం
బులకు నపాయంబు సేయు పురుషాధము ని
మ్ముల దూషించి జగంబును
గులమును రక్షించు టరుదు కువలయనాథా!

“కావున నిప్పుడు దుర్యోధను దూషించి విడిచిపుత్తము. అంత మాత్త్రమున నీకు నష్టములేదు. ఇంకను నీకుఁ బెక్కురు పుత్త్రులు సంపూర్తిగాఁ బెరుగుచున్నవారు. ఇతఁడు లేనంత మాత్త్రమునఁ గొఱంత రాదు. నాచెప్పినట్లు నడతువేని కులంబును, దేశంబును, ప్రజలను, రక్షించినవాఁడ వగుదువు” అని యుపదేశించెను.

పుత్త్రవ్యామోహముచేత ధృతరాష్ట్రుఁడు పుత్త్రుని విడిచి పెట్టలేకపోయినను విదురుఁడుమాత్త్రము తన విధాయక కృత్యము నెఱవేర్పక పోలేదు. పుత్త్రజననోత్సాహభరితుఁడగు

మహారాజుతో నట్లు నిర్భయముగా లోకక్షేమార్థియై పుత్త్రి
త్యాగమునుగుఱించి విదురుఁ డొనర్చినహితోపదేశమే యతని
దూరదర్శిత్వమును గర్తవ్యానురక్తిని బ్రజారక్షణాసక్తిని,
వెల్లడి చేయుచున్నది.

మొదల నప్రియ మయ్యును దుదిఁ గరంబు
పథ్య మగుపల్కు ప్రియులందు బలిమి నైనఁ
బలుక వలయు మోమోడక యొలసి యట్టి
వాఁడు తగుసహాయుండు భూవల్లభునకు.

ఈపద్యమునందు జెప్పఁబడిన యుత్తమగుణము విదురుని యందు నెలకొని యున్నదనుటకు సందియము లేదు. హితోపదేశమునందును, దూరదృష్టియందును, గార్యాలోచనమునందును రాజభక్తియందును, న్యాయాన్యాయపరిశీలనమందును ధృతరాష్ట్రునకు విదురునివంటిమంత్రి వేఱొకఁడు లేఁడు. విదురునివంటి మంత్రిసత్తముఁడు గల్గినందులకుఁ దగినఫలమును ధృతరాష్ట్రుఁ డనుభవింపలేక తనవంశనాశ మొనర్చుకొనెను. అది ధృతరాష్ట్రునిలోపమే. అంధుని యందున్న దివ్వెవలె పుత్త్రవ్యామోహామూఢుఁ డగుధృతరాష్ట్రుని చెంత విదురుని బుద్ధియు, నాలోచనమును వ్యర్థము లయ్యెను.

## ౨

### విదురునికిఁ బాండవులందుగల్గిన యాదరము.

లోకములో ధర్మాత్ములు సాధుశీలురు నగునుత్తమపురుషులు తమకన్నులయెదుట నధర్మ ముప్పతిల్లినను, క్రూరకార్యము

లాచరింపఁబడినను జూచి సహింపలేరు. సహింపలేకపోవుటయే కాదు; అధర్మపరులను, క్రూరులను జూచి వారు ద్వేషించి వారిని దమచెంతకైనను జేరనీయరు. ఆదుష్టులతో వారు శత్రుభావమును వహించి సాధుపక్షావలంబులయి వర్తింతురు. ఇది యుత్తమపురుషస్వభావము. ఆలోచింప, విదురుఁ డట్టి యుత్తమపురుషుఁ డనుటకు సందియము లేదు. పాండవధార్త రాష్ట్రులు విదురునకు సమానులయినను బాండవుల సద్గుణము లతనిచిత్తము నాకర్షించినట్లు దుర్యోధనాదుల గుణము లాకర్షింపలేకపోయినవి. ధార్తరాష్ట్రులందు హేయభావమును, బాండవులందు సమాదరమును, విదురునకు గల్గుటకుఁ గారణము వారివారి దుర్గుణ సద్గుణములే కాని వేఱు కాదు. ఇది తెలియక విదురుఁడు పాండవపక్షపాతి యనుచుందురు. ఆపక్షపాతము సద్గుణజన్యము కాని స్వభావజన్యము కాదు.

పాండురాజు మరణానంతరమునఁ గుంతీదేవి ధర్మజభీమార్జున నకులసహదేవులతోఁ గూడ హస్తినాపురికి వచ్చెను. అట్లు వచ్చిన పాండుకుమారులను జూచి భీష్మవిదురాదులే కాక పురప్రజ లందఱును మిక్కిలియానందించిరి. ఆపిల్లలు మిగుల సుందరులై దేవతాకుమారులను మించు తేజమున నొప్పుచుండిరి. తాదృశసౌందర్యదివ్యతేజములకుఁ దోడు ధర్మరాజాదులకు వినయసౌజన్యాదు లలవడి యుండుటచే వారు సులభముగానే లోకుల చిత్తముల నాకర్షించికొనఁగల్గిరి. సింగపుఁగొదమలభంగి వర్తించు నా పాండు కుమారులను

జూడఁగా ధార్తరాష్ట్రుల కసూయయు దక్కినవారికి సమాదరమును గల్గెను. ఇట్లుండ నుత్తమపురుషుఁడైన విదురునికిఁ బాండవులందు సమాదరము గల్గుట వింతకాదు. పాండవులు దివ్యతేజోవిలసితు లగుటచేతనే విదురాదులకుఁ బ్రేమాస్పదులైరి. ఆపైఁ బితృవిహీనులగు బాలకు లగుటచే వారియందు మఱింతప్రేమ ముదయించుట కవకాశముగల్గెను. ఆమీఁద వారి సద్గుణపుంజమువలన నా ప్రేమ మఱింత వర్ధిల్లెను. పాండవుల గుణములు లోకుల చిత్తములవలెనే విదురునిచిత్తమునుగూడ నాకర్షించి యుండును. పాండవులు తమసత్ప్రవర్తనముచే విదురునిఁదమవంక కాకర్షించికొనుచుండ సుయోధనాదులు తమ దుష్ప్రవర్తనముచే నాతని దమకు విముఖుని గావించికొనిరి. పాండవులు దివ్యమూర్తులై యున్నను, పితృహీనులై యున్నను, వారివలె దుర్యోధనాదులుగూడ సద్గుణవంతులై వర్తించినచో నప్పుడు విదురుచిత్త మిరువాగుల వారియందును సమభావము గల్గియుండునని చెప్పుటకు సందియ ముండదు; కాని దుర్యోధనాదులు పాండవులను సత్ప్రవర్తనముచే జయింపవలెనని యూహింపక కపటముచేతను, క్రౌర్యముచేతను జయింపఁ బ్రయత్నించిరి. అందుచే విదురునకు దుర్యోధనాదులందు ద్వేషబుద్ధి ప్రబలము కాఁజొచ్చెను.

పాండవధార్తరాష్ట్రులు కొంతకాలము కలసి మెలసి వర్తించిరి. ఆయుధవిద్యల నభ్యసించిరి. అశ్వాదివాహనారోహణనిపుణులైరి. ప్రవర్తనమందును, విద్యాభ్యాసమునందును

పాండవులు ధార్తరాష్ట్రులను మించి ప్రజలమెప్పును బడయు చుండిరి. అది దుర్యోధనాదులకు మిగులఁ గష్ట మనిపించెను. దుర్యోధనుని యసూయానలము క్రమక్రమముగాఁ బ్రజ్వరిల్లెను. అది పాండవుల నాశనముతోఁగాని చల్లారునట్లు లేదు. అందుచే దుర్యోధనుఁడు రహస్యముగాఁ దండ్రితో నాలోచించి యతనికి నచ్చఁజెప్పి ముందుముందు పాండవులవలనఁ దమకుసంభవించు నాపదలను వక్కాణించి పాండవులు హస్తిపురివిడిచి వారణావతమునకుఁబోయి నివసించునట్లాజ్ఞాపింపఁ బ్రార్థించెను. దానికి ధృతరాష్ట్రుఁ డతికష్టమున నంగీకరించి పాండవులను వారణావతమునకుఁ బంపెను. ఈలోపున దుర్యోధనుఁడు పురోచనుఁ డనువానితో నాలోచించి పాండవులు నివసింప లక్కయిండ్లను నిర్మింపఁజేసెను. సమయముచూచి పాండవులతోఁ గూడ లక్కయిండ్లుదహించి రమ్మని యతనికాజ్ఞాపించెను. పాండవుల సద్గుణములనుజూచి సహింపలేక దుర్యోధనుఁడుచేసిన దుస్తంత్ర మిది. ఈరహస్యమును విదురుఁడెట్లో తెలిసికొని పాండవులు వారణావతమున కరుగుచున్న సమయమున వారిని వెంబడించి కొంతదూర మరిగి ధర్మరాజును జూచి యిట్లనెను.

ఎల్లకార్యగతులు నెఱుఁగుదు రైనను
నెఱుఁగఁజెప్పవలయు నెఱిఁగినంత
పనియు లేక మిమ్ముఁ బంచినకుర్పపతి
హితుఁడుపోరె మీఁద నెగ్గుసేయు.

అని చెప్పుటచే ధర్మరాజాదులు జాగరూకులై యా యాపదను దప్పించుకొనఁగల్గిరి. విదురుఁ డారహస్యమును బాండవుల

కెఱింగింపనిచో వారు లక్కయింట్లలో దగ్ధులై పంచత్వ మొందవలసినవారే. విదురుఁ డుత్తమపురుషుఁడు గనుకనే సాధుశీలు రగు పాండవులకు దుష్టాత్ములగు దుర్యోధనాదుల వలనఁ గల్గునాపదలను జూచి సహింపలేక తద్రహస్యమును వారి కెఱిఁగించెను. విదురునిచే నిట్లు చేయించినది యతని యుత్తమస్వభావమే కాని బంధుత్వముకాదు. సాధుస్వభావము గలవారు పాండవేతరు లయినను విదురుఁడు వారి ప్రాణరక్షణా మునకు బద్ధకంకణుఁ డగువాఁడే కాని యూరకుండువాఁడు కాఁడని జెప్పవలసి యున్నది.

భీష్మాదికురువృద్ధులు నిజముగాఁ బాండవులు లక్కయిండ్లలో దగ్ధులైరని నమ్మి మిక్కిలి దుఃఖించి వారికి బారలౌకికక్రియ లొనర్చిరి. పాండవుల కుశలము నెఱిఁగి విదురుఁడు లోలోన సంతసించుచు నూరకుండెనే కాని యెవ్వరికిని జెప్పలేదు. ఆవిషయమును భీష్మునకైనను దెలియఁ జేసినట్లు గన్పట్టదు. ఒకవేళ తానా పాండవుల కుశలవార్త తెలియఁజేసిన నది క్రమముగా దుర్యోధనాదుల కర్ణపథమునఁ బడక మానదనియు సుయోధనుఁడు విఫల ప్రయత్నుఁ డగు టంజేసి మిక్కిలి కుపితుఁడయి పాండవులజాడ లెట్లయిన నరసి వారిని సంహరింపక మానఁడనియు విదురుఁ డెఱుఁగును. అందుచేత తద్వార్త పాండవహితులగు వారిచెవినైనఁ బడకుండు నట్లు చేసి యున్నాఁడు. ఈ యంశమే పాండవులందు విదురునికిఁ గల యవ్యాజకృపారసమును వెల్లడించు చున్నది.

## 3

పాండుపుత్రులు ద్రౌపదీస్వయంవరమునఁ దమభుజబలమును బ్రకటించి బయలుపడిరి. ధృతరాష్ట్రాదులు దక్కినలోకు లందఱుఁ బాండవులు బ్రదికియున్నందులకుఁ బరమానందభరితు లయిరి. పాండవులు సజీవులై యుండుటయే కాక ద్రౌపదీ దేవితోఁగూడఁ గీర్తికాంతను జేకొనుట కన్నులారఁ గాంచి నప్పుడు దుర్యోధనుఁడు పొందినదుఃఖమునకుఁ బారములేదు. పాండవులశ్రేయస్సు దుర్యోధనుని హృదయమునకు శల్య తుల్యమై యనుక్షణమును బాధింపఁదొడఁగెను. దుర్యోధనుఁడు రారాజయినను విదురునికి భయపడుచుండువాఁడు. విదురుఁడు ధృతరాష్ట్రుని చెంత నున్నపుడు తనయాటలు సాగవని తెలిసికొని సుయోధనుఁ డట్టిసమయమునకుఁ బ్రతీక్షించు చుండెను. ఈయంశము దుర్యోధనుఁడు చెప్పిన మాటలవలనఁ దెలియవచ్చుచున్నది. "ఓజనకా! విదురుఁడు పాండవపక్ష పాతి. ఎల్లప్పుడు నతఁడు వారిహితమునే కోరుచుండును. నీవు మూఢబుద్ధితో నావిదురుని వచనములనే పాటింతువు. ఆ విదు రుఁడే మీకాప్తమిత్రుఁడు. అందువలన మన కనేకానర్థములు సంభవించుచున్నవి. మఱియును,

శ్రేయును బగలును విదురుఁడు
నీయొద్దన యునికిఁజేసి నేరముఁ పలుకన్
మాయిష్టం బెఱిఁగింపఁగ
ధీయుత యెడఁ గంటి మిన్నిదివసంబులకున్."

"అహోరాత్రములం దెప్పుడును విదురుఁడు మిమ్మొడఁ

బాయకయుండుటచే మా యభిప్రాయంబు నీకెఱిగింప నవకాశ మొకప్పుడును లభించినదికాదు. దైవవశమున నిన్నిదినములకు మాకట్టిసమయము లభించిన" దని సంతసించెను. ఈ విషయ మాలోచింప విదురుఁడు దుర్యోధనాదులకుఁ బ్రక్కలోని బల్లెమువలె వర్తించుచున్నట్లు తెలియవచ్చుచున్నది. కౌరవుల దుర్నయసముద్రమునకు విదురుఁడు చెలియలికట్టయని చెప్ప వలసియున్నది. ఎప్పటికప్పుడు విదురుఁడు దుర్యోధనాదుల దుష్కార్యముల కడ్డుపడకయుండిన వారింతకంటెను హెచ్చి పోవుదు రనుటకు సందియములేదు.

ధర్మమును, న్యాయమును, హితమును నుపదేశించునెడ భీష్మద్రోణులకంటె నీతఁ డుత్కృష్టుఁడని చెప్పవలసియున్నది. ఇతనివలె నిర్భయముగా నిస్సందేహముగా హితోపదేశముఁ జేయువా రరుదు. పాండవులు ద్రౌపదిని వివాహమై పాంచాల దేశమునం దున్నప్పుడు వారిని హస్తిపురికిఁ గొనివచ్చుటయా, మానుటయా ? యని యాలోచించుసమయమున భీష్మద్రోణులు తగువిధమునఁ జెప్పి యూరకుండిరి. ఆసమయమున విదురుఁడు ధృతరాష్ట్రునికిట్లు బోధించెను.

విదురుని హితోపదేశము

"మహారాజా! భీష్మద్రోణులు ధర్మార్థములు చక్కఁగఁ దెలిసినవారు. తథ్యవాదులు, వయోవృద్ధులు, మధ్యస్థులు, నిర్మలమనస్కులు. వారు నీకేది బోధించినారో నీవు దానినే యొనర్చుట ధర్మము. ఆలోచింప నీకు వారలకంటె హితు

లెవ్వరును లేరు. దుర్యోధనుఁడును వానిసహచరు లగు కర్ణ శకునిదుశ్శాసనులును మిక్కిలి బాలురు. ఇది ధర్మమనియు నిది యధర్మమనియు వారి కేమి తెలియును? అట్టివారి మాటలు నమ్మి నీవు వర్తించుట తగదు. కావునఁ బాండురాజ కుమారులను వేగముగా రప్పించి వారి కర్ధరాజ్యము నిచ్చి గౌరవించుట ధర్మము. పాండవులు దమంత తామె దేవతలకును దుర్జయులు. ఆపై శాత్రవగర్వనిర్వాపకుఁడు ద్రుపదరాజు వారికిఁ జుట్టమయ్యెను. వారి బావమఱఁది యగు దుష్టద్యుమ్నుఁడు వారివలెనే నిరుపమాన పరాక్రమశాలి. ఇంతేకాక వారికి బలరాముఁడు, కృష్ణుఁడును, సాత్యకియు నాప్తమిత్రులుః; హిత ముపదేశించు మంత్రులు. ఇంతియ కాక పాండవులకు దైవపౌరుషములు రెండునుగలవు. ఆ రాజసుతులు నీకు దుర్యోధనాదులకంటెను నెక్కుడు భక్తులు. నీ కెప్పుడును విధేయులై వర్తించువారు; మహాధీరులు. అప్పాండుపుత్త్రులు నీపుత్త్రులుగారా! వారిని దూరస్థులనుజేయుట నీకుఁ దగునా?

ఆహవభూమిలోనఁ బరమార్థము పార్థుఁడు వైరివాహినీ
వ్యూహము వచ్చుచోట మఘవుండును వానికి మార్కొనంగ ను
త్సాహము సేయఁ డన్న లఘుసారు లధీరు లసాహసుల్ నిరు
త్సాహులు ద్రోహులై యెదిరి చత్తురొ నొత్తురొ మానవేశ్వరా!

ఆయతబాహుఁ డాతనికి నగ్రజుఁ డగ్రణి పోరులందు నా
గాయుతసత్త్వుఁ డుద్ధత యుగాంత కృతాంతనిభుండు భీముఁ డ
వ్వాయుజసవ్యసాచుల నవార్యబలోన్నతిఁ బోలుచున్న మా
ద్రేయు లజేయు లెవ్వరికి దేవసముల్ సమరాంతరంబునన్.

మహారాజా! యుద్ధభూమియందు పార్థుఁడు నిజముగా శత్రుసంహారము జేయఁ దలంచినపుడు దేవేంద్రుఁ డైనను వచ్చి యతని మార్కొనలేఁడు. అట్లని చెప్పవలసి యుండగా నల్పబలులు నధీరులు సాహసహీనులు నిరుత్సాహులు నగు దుర్యోధనాదు లా యర్జును నెదిరించి చత్తురో చంపుదురో యోజింపుమా! ఆ యర్జునున కగ్రజుఁ డగు భీముఁడు దృఢ బాహువు. యుద్ధములందుఁ బార్థుని మించినవాఁడు. పదివేల యేనుఁగుల బలముగలవాఁడు. యుగాంతమున కీడువచ్చువాఁడు. అట్టి భీమార్జునులకు బాహుబలంబున నకుల సహదేవు లెంత మాత్రమును దీసిపోవువారు కారు. వారెట్టివారికిని దుర్జయులు. రణాంగణమున వారు దేవతల కెనవచ్చువారు. భీమార్జున నకుల సహదేవు లెట్లు నట్లుండ యట్లె ధర్మరాజునకు ధర్మమును, ధైర్యమును, సత్యమును, గృపయు నను నీ నాల్గుగుణంబులును వశ్యములయి యొప్పుచుండును. ఆ ధర్మరాజు వైభవ మేమన వచ్చును? అతని కీలోకములం దసాధ్యమగున దేదైన నుండునా? ఆమహాత్ముల బలపరాక్రమంబు లెల్ల వారికి దృష్టపూర్వంబులు. అట్టివారితోఁ గలహించు నవివేకు లుందురా? ఆ యుత్తములు నీపుణ్యవశంబున జననీసమేతముగా లక్క యింటిలోఁబడి క్రుందకుండఁ దప్పిపోయినారు. వారిప్పుడు సజీవులయి యుండుటచే లోకాపవాదము గొంత నశింపవచ్చును. అయినను గుటిలాత్ముఁ డగు పురోచనుఁ డమ్మహానీయులయెడ మహాపరాధము గావించి నీకు దుర్యశఃపంకము గల్గించినాఁడు. ఆ యపకీర్తి

పంకమును బాండవానుగ్రహ మను జలంబులఁ గడిగికొనుము. అంతకంటెనీకు నుత్తమమార్గములేదు. దుర్యోధనుఁ డొనరించు నపరాధమువలన మహీప్రజకుఁ దప్పక ముప్పువాటిల్లునని యిదివఱకే చెప్పియున్నాను. అది నీవు పెడచెవినిఁ బెట్టితివి. కావున నీ విప్పుడయిన నావచనము లిమ్ముగ విని పాండవుల రప్పించి యర్ధరాజ్యంబిచ్చి యాదరింపు మని నిశ్చయముగా నుపదేశించెను.

ఇట్లు విదురుఁ డొనర్చిన దీర్ఘోపన్యాసంబు విని ధృతరాష్ట్రుఁడు సంతుష్టుఁడై దుర్యోధనాదులు వలదు వలదని నిర్బంధించుచున్నను వారిమాటలను సరకుగొనక సభ్యుల సమక్షమునఁ బాండవుల కర్ధరాజ్యం బిచ్చుటకు నిశ్చయించెను. పుత్త్రవ్యామోహావశుఁడయి పెడదారిని బట్టిన ధృతరాష్ట్రుని యుక్తమార్గమునఁ బెట్టిన దా విదురుని యుపదేశమే యనుటకు సందియము లేదు.

అనంతరము ధృతరాష్ట్రుఁడు ద్రుపదుని పురంబున నున్న పాండవులను దోడ్కొని వచ్చుటకు యత్నించెను. కాని యది యతనికి సులభముగాఁ దోపలేదు. పాండవులచిత్తంబు లిప్పు డెట్లున్నవో యతని కేమి తెలియును? తన పంపిన వార్త విని పాండవులు కుపితులై తొంటి యపకారంబుల నుద్ఘాటించి తిరస్కరించినచో ధృతరాష్ట్రున కంతకంటెఁ బరాభవ ముండదు గదా? మఱియు నాపన్నులయిన పాండవులను జేరఁదీసి పిల్ల నిచ్చి మహాభ్యుదయోపేతులఁ గావించిన ద్రుపదుఁడు తన

సందేశమును నిరసించి పంపివేయునేమోయన్న సందియ
మా రాజేంద్రుని బాధింపసమకట్టెను. కావున నట్టిసమయమునఁ
బాండవులను గొనివచ్చుట కరుగువాఁడు మహాబుద్ధిమంతుఁడై
కార్యజ్ఞుఁడై యుక్తాయుక్త వివేకియై యుండవలయును. అట్టి
వాఁడు కౌరవసభలో విదురునికంటె నితరుఁ డెవ్వాఁడుగలఁడు?
అందుచే ధృతరాష్ట్రుఁడు పాండవులకు వేలువేల రత్నభూష
ణాంబరాదులను బహుమానముగా నిచ్చి శీఘ్రముగా వారిని
గొని తేర విదురునిఁ బంచెను.

మహామతిమంతుఁడగు విదురుఁడు ద్రుపదుపురంబున కరిగి
ద్రుపదరాజును శ్రీకృష్ణసహితులగు పాండవులనుజూచి ధృతరా
ష్ట్రుఁడు పంపినకానుకల నర్పించి వారిచేతఁ బ్రతిపూజితుఁ
డగు పాండవులు వినుచుండ ద్రుపదరాజుతో నిట్లనెను.
"ద్రుపదరాజా! నీ వున్నతవంశసంభూతుఁడవు; ధర్మశీలుఁడవు;
మహానుభావుఁడవు. అట్టి నీతోడి చుట్టరికము మిక్కిలి శ్లాఘనీయ
మైనది. మిగుల ననురూపమైనది. ఇట్టిది తమ కురువంశమునకు
సంభవించుటచే ధృతరాష్ట్రుఁడును, భీష్మాది కురువృద్ధులును,
ద్రోణాదిగురుజనంబును మిక్కిలి సంతోషించుచున్నారు.
అత్యుదారస్వభావు లగు పాండవులును, బరమపతివ్రత యగు
వారితల్లియు మమ్ము నెడఁబాసిపోవుటచే హస్తిపురవాసుల
మగు మేమందఱమును మిక్కిలి దుఃఖించుచుంటిమి. ఇప్పుడు
నీయల్లురగు పాండుపుత్త్రులను జూచి యానందింపఁ గురుకులే
శ్వరుఁడు మొదలగు బంధువర్గమును, దక్షిణపౌరులును
మిక్కిలి వేడుకపడుచున్నారు."

"అభిజాతుండవు ధర్మశీలుఁడవు నీయందైన సంబంధ మిం
దభిరమ్యం బనురూప మిష్టమని సౌహార్దంబునన్ జాహ్నవీ
ప్రభవుండున్ ధృతరాష్ట్రుఁడుం గృపుఁడుం గుంభప్రోద్భవుండున్ యశో
విభవాలంకృత, సంతసంబు పడి రుర్వీవంద్యు లిష్టంబునన్."

"తల్లియుఁ బుత్త్రు లేవురు నుదారమతుల్ తమయొద్ద బాసినం
దల్లడ మంది యందఱును దద్దయు దుఃఖితచిత్తులైరి నీ
యల్లురఁ బాండుపుత్త్రులఁ బ్రియంబునఁ జూడఁగఁ గోరు చున్నవా
రెల్లజనంబులుం గురుకులేశ్వరుఁ డాదిగ బంధువర్గమున్."

"కావున సద్గుణపూజితులగు పాండవులను, గురువంశము నకు మణిదీపమువంటికోడలిని, బరమపతివ్రత యగు కుంతీ దేవిని హాస్తినాపురమునకుఁ గొని రావలయు నని ధృతరాష్ట్ర మహారాజు నన్నంపినాఁడు. నీవాజ్ఞాపించినఁగాని వీరచ్చటికి రాఁజాలరు. దయయుంచి వీరిని బంపు" మని పలికెను. ఇట్లు విదురుఁడు యుక్తియుక్తముగను వినయోపేతముగను సంభాషించి ద్రుపదరాజును సంతుష్టునిఁ గావించి కుంతీ పాండవుల మనంబులలోనికళంకంబుఁ దొలఁగించి వారి నానంద మగ్నుల నొనరించెను. ఈదృశ మృదువచన రచనాధోరేయుని కోర్కి నెవ్వరు త్రోసివేయఁగలరు?

విదురుని వచనములు విని ద్రుపదుఁడు సంతసించి "ఓ గుణశాలీ! నీవచనముల కానందించితిని. భానుసమాన తేజుఁ డగు ధృతరాష్ట్ర మహారాజు పంపఁగా నుత్తమపురుషుఁడవగు నీవీ కార్యభారము వహించిరాఁగా నీపాండవుల కిష్టసిద్ధిగలుగుట

కాటంక మేమి? శ్రీకృష్ణుఁడును, నీవును వీరికి నిరంతరమును శుభములను సమకూర్ప సమకట్టియుండ వీరికాపద లెట్లు సంభవించును? నీవును, ధృతరాష్ట్రుఁడును, భీష్ముఁడును, నాను దేవుఁడును దేనిని హితమని తలంతురో యదియ నాకును బ్రియము. పాండవులను దప్పక దీసికొనిపొ" మ్మని పలికెను. మహానుభావుఁడగు విదురుఁడు పాండవులహితము గోరుచుండ నెవ్వ రేమి చేయఁగలరు? పాండవుల కట నపాయము సంభ వించునని శంకింపఁ బనిలేదని కృష్ణుఁడు పలికెను. కురుముఖ్యులగు భీష్మవిదుర ధృతరాష్ట్రాదులుండ మాకేమియు దోసఁగు వాసఁగనేరదని ధర్మరాజు వచించెను. సర్వజనాదరణపాత్రుఁ డును, ధర్మవర్తనుఁడును నగు విదురుఁడు తను కాదగువుగా నుండఁబట్టియే పాండవులు మగుడ హాస్తిపురికి రానుద్యమించిరి. కాని వేఱొకర రట్లు పిలువవచ్చినచోఁ బాండవు లంత నిర్భయ ముగాఁ గరినగరమున కరుగఁ జాల రని చెప్పవలసి యున్నది.

పాండవులు ద్రుపదుననుమతి వడసి విదురుని బురస్కరించి కొని హాస్తినాపురంబుఁ బ్రవేశించిరి. ధృతరాష్ట్రుఁడును దక్కినవారును బాండవుల నెదుర్కొని యాదరించి గౌరవిం చిరి. పురజను లందఱును నారిని దీవించిరి. పాండవులును గులవృద్ధులగు భీష్మాదులకు నమస్కరించి దీవన లందిరి. పాండవులును గౌరవులును దొంటివిధంబునఁ బరస్పరమునుగలిసి వినోదములఁ బ్రొద్దులు పుచ్చుచుండిరి. అనంతర మొకనాఁడు ధృతరాష్ట్రుఁడు భీష్మవిదురాదులును, దుర్యోధనాదులును

జూచుచుండ ధర్మరాజున కర్ధరాజ్య మిచ్చి యాదరించెను. పాండవులు మరల నిట్టి సమున్నతస్థితికి వచ్చుటకుఁ గారణము విదురుఁడే యని నొక్కి వక్కాణింపవలసి యున్నది. విదురుఁ డట్లు నిర్భయముగా ధర్మయుక్తముగా ధృతరాష్ట్రునికి బోధింపనియెడల నతఁడు పాండవులను రక్షించుటయు, రాజ్యమిచ్చి యాదరించుటయుఁ బొసఁగియుండదు. మహానుభావుఁ డగు విదురుఁడు పాండవులను లాక్షాగృహమునుండి తొలఁగించి రక్షించుటయే కాక వారి నిట్టి మహోన్నతదశకుఁగూడ దెచ్చి యున్నాఁడు. ఆప్తుఁ డనగా నిట్టివాఁడే కదా!

## ౪

పాండవులు ధృతరాష్ట్రు ననుగ్రహమున నర్ధరాజ్యంబు వడసి భీష్మ విదురాదుల యనుమతి చెంది ఖాండవప్రస్థమును రాజధానిగాఁ జేసికొని రాజ్యపరిపాలనం బొనరించుచుండిరి. అది మొదలు పాండవుల యభ్యుదయ మత్యున్నతి వహించెను. విశ్వకర్మ యింద్రప్రస్థనగరంబును నిర్మించి పాండవుల కిచ్చెను. మయుఁడు లోకపాలురసభలను మించిన సభామందిరమును నిర్మించెను. నారదోపదేశంబున ధర్మరాజు రాజసూయం బొనరించెను. భీమాదులు నలుదిక్కుల జయించి రాజులవలన ధనరాసులను, రత్నరాసులను గొనివచ్చి యింద్రప్రస్థమును నిండించిరి. రాజసూయముతో ధర్మరాజు కీర్తియే కాక ధన సంపదలు గూడ మిన్ను ముట్టెను. ఇప్పు డతఁడు భూలోక

వాసులచేతనే కాక సురలోకవాసులచేతఁగూడ మెప్పు వడయుచుండెను.

పాండవుల మహావైభవమును గాంచి దుర్యోధనుఁడు మచ్చరపడి కర్ణాదులతో నాలోచించి కపటద్యూతమునఁ బాండవలక్ష్మినని హరింప నిశ్చయించికొనెను. అనంతర మతఁడు ధృతరాష్ట్రునితోఁ దన కష్టసుఖములు చెప్పికొని ధర్మరాజుతో సుహృద్ద్యూతము నాడ ననుజ్ఞ వేఁడెను. కాని యతఁ డందుల కంగీకరింపఁ డయ్యెను. తన యభిలషితమునకు సమ్మతింపనిచో మేను దొఱఁగెదనని సుయోధనుఁడు తండ్రితో ఖండితముగాఁ జెప్పఁగా నతఁ డుపాయాంతరంబు గానక కుమారుని యిష్టమున కనుమతించి యొకనాఁడు రహస్యముగా విదురునిఁ బిలిపించి శకుని దుర్యోధనుల యభిప్రాయం బెఱిఁగింప నతఁడు విస్మితుఁడై రాజున కిట్లనియెను.

విదురుఁడు జూదమాడఁ దగదని ధృతరాష్ట్రునితోఁ జెప్పుట

" మహారాజా! యీ దురాలోచనమునకు నేను మిక్కిలి దుఃఖించుచున్నాను. కలి ద్వాపరముల సంధికాల మగుటచే నీ సమయ మఖిలప్రజాక్షయకరమని పెద్ద లందురు. అందులకుఁ దగిన సన్నాహములే మీ రొనర్చుచున్నట్లున్నది. రాజేంద్రా! జూద మెట్టి శాంతచిత్తులకున్ గూడఁ గలహాభివృద్ధి నొందింపక మానదు. నీ వీజూదమునకు సమ్మతించుట నీసుతులకు బాండుసుతులకును వైరము పుట్టింప సమ్మతించుటయే. ఇది యెంత మాత్రమును దగదు. ఇట్టి దుష్కార్యమునకు నే నంగీకరింపఁ

జాలను. నీవు నా హితవచనములు విని శకుని దుర్యోధనుల దుర్వ్యవసాయము మాన్పి కురువంశము నుద్ధరింపుము” అని హిత ముపదేశించెను. ధృతరాష్ట్రుఁ డది వినక యింద్రప్రస్థమున కరిగి ధర్మరాజును దోడ్తెమ్మని పలుక రాజు మూర్ఖత్వమునకు విచారించుచు నా సమాచారము భీష్మునితోఁ జెప్పి యా దుష్ప్రయత్నమునుండి దుర్యోధనాదులను మరలింప యత్నింపఁ దొడఁగెను.

సామాన్యముగా హితులు తమ మిత్రులు తమ బోధనలను విననప్పుడు మరల మరలఁ జెప్పిన వారికెక్కడఁ గోపమువచ్చునో యని యూరకుందురు. విదురుఁ డట్టివాఁడు కాఁడు. ఎవ్వరికిఁ గోపము వచ్చిన నెవ్వరు దన్ను నిందించిన నతఁడు మాటిమాటికిని హిత ముపదేశించుచునే యుండును; కాని వెనుదీయు వాఁడు కాఁడు.

ధృతరాష్ట్రుఁడు తన హితవచనములను బెడచెవిని బెట్టి ధర్మరాజాదులను దోడ్కొని రమ్మని విదురునితో ననఁగా నతఁడప్పుడును మిగుల విషణ్ణహృదయుఁడై “అయ్యా! మాయా దురోదరమువలదు, వలదు! దీనిని మానుట యుభయ పక్షములకు శ్రేయస్కరము. నామాటవినుఁడు, నామాటవినుఁ!” డని మఱిమఱి ధృతరాష్ట్రున కుపదేశించెను. అప్పటికి నతఁడు తనవచనములు బెడచెవిని బెట్టఁగా విదురుఁడు మిక్కిలి విచారించి తనలో “ఓహో! ఈ దుర్వ్యవసాయము దాఁటరానిది. కురువంశమున కేదో గొప్పచెట్టను సమకూర్ప దైవము నిశ్చ

యించి కొన్నట్లున్నది. ఇట్టిదానిని దప్పింప మనకశక్య" మని తలపోసి సోదరునాజ్ఞ ననుగమించెను.

అనంతరము ధర్మరాజాదులు హాస్తిపురి కరుదెంచి ధృతరాష్ట్రునకును, భీష్మాదికురువృద్ధులకును నమస్కరించి ధృతరాష్ట్రుఁడు కట్టించిన నూతన సభాభవనమును వీక్షించి సంతసించిరి. దుర్యోధనుఁడు తమతో నందు జూద మాడ వలయు నని కోరఁగా ధర్మరాజు మొదట నిరాకరించియుఁ దుద కంగీకరించెను. ఆ దివ్యమందిరమున ధృతరాష్ట్ర విదుర భీష్మాదుల యెదుటనే ధర్మరాజు శకునితో జూద మాడనారంభించెను. శకుని తన మాయాప్రభావమున ధర్మరా జొడ్డిన వాని నెల్లను గెలుచుచుండెను. ధర్మరా జోడిపోవు చుండెను. అది చూచి విదురుఁడు ధృతరాష్ట్రునిసమీపించి రహస్యముగా నిట్లనియెను.

విదురుఁడు జూదమును నివారింపుమని ధృతరాష్ట్రుని గోరుట

"మహారాజా! దుర్యోధనుఁడు నీచాత్ముఁడు. వీఁ డావదలతోఁగూడ నుద్భవిల్లెను. వీఁడు పుట్టినప్పుడు పెక్కు దుర్నిమిత్తంబులు పొడమెను. ఇతనివలనఁ గురుకులమున కాపద సంభవించునని నేను మొదటినుండియుఁ జెప్పుచునేయున్నాను. కాని నీవు నామాటలను వినవైతివి. మనకురువంశము లోకములో మిక్కిలి వాసిగాంచినది. మహాభిషుఁడు, భీమసేనుఁడు, ప్రతీపుఁడు, శంతనుఁడు మొదలగు మహామహు లుదయించుటచే నీకుల మతిపవిత్రమై మహోన్నతిఁ గాంచినది. అట్టి దానికిఁ బాపకళంక మాపాదించుట తగదు. ఇదివఱకెప్పుడు నది

పాపదూషితము కాలేదు. పాలసంద్రమువలె నతినిర్మల మగు కురుకులమున కిక్కాలమున దుర్యోధనునిమూలమున దుష్కీర్తి కళంకము సంభవించుచుండఁ జూచి మనవంటివా రూరకుండుట తగదు. ఒక్కని కారణంబునఁ గులము దూషితంబగునేని వానిని దొలఁగించి కులంబు రక్షించుట ధర్మమని పెద్దలందురు. తమకులమును రక్షించుకొనుటకే కాదా యాదవవృష్ణివీరులు శ్రీకృష్ణుని నియోగించి కంసునిఁ జంపించిరి? దానివలన వారి వంశము నిష్కళంకమై యొప్పుచున్నది. నీవుగూడ నిప్పట్టున నట్లొనరించుటయే యుత్తమము. అర్జునుఁడు ధర్మవిదుఁడు. నీ వాజ్ఞాపించినచో నతఁడు విచారదూరుఁడగు సుయోధనుని సమయింపఁ గలఁడు. దానం జేసి నీకులము సుఖింపఁగలదు. నీప్రజలుగూడ నిర్భయులై సుఖింపఁగలరు. కావున నట్లు చేయుము. ఈవిరోధమును మాన్పింపుము."

"వాసవాత్మజుఁ బంపు మిప్పుడ వాఁడు ధర్మవిదుండు నీ
శాసనంబున నిగ్రహించు విచారదూరు సుయోధనున్
భూసతీశ్వర, దీన నీకులముం మహీప్రజయున్ గత
త్రాసవృత్తి సుఖంబు వొందుఁ బ్రధానవిగ్రహ మేటికిన్."

"మానవేశ్వరా! ఈదుర్యోధనుఁడు మానవాధముఁడు; గుణహీనుఁడు. వీనిని బహిష్కరించి ధర్మమార్గమునఁ గౌరవ వంశమును బాలింపుము. మహావ్రతావవంతులును, సద్గుణవంతులును నగుపాండవులు నిన్నుఁ గొల్చుచుండ నీరాజ్యము నేలుము. అదినీకు మిక్కిలి పథ్యము. ఒకనకక్క నిచ్చి సింహా

ములను బుచ్చుకొన నెవ్వారైనను సందేహింతురా? అట్లే నీచాత్ముండగు దుర్యోధనుని బహిష్కరించి మహామహులగు పాండవులను జేకొన వెనుదీయుదు వేల? ఇంతకును బాండవులు నీకుఁ బరులు కారుగదా? నామాటవిని కులమును రక్షింపుము."

> "ఇమ్మనుజాధమున్ గుణవిహీను బహిష్కృతుఁజేసి ధర్మమా
> ర్గమ్మునఁ గౌరవాన్వయము గావుము పాండుతనూజులం బ్రతా
> పమ్మెసఁగంగ నేలు మిది పథ్యము సుమ్మొక నక్కనిచ్చి సిం
> హమ్ములఁ బుచ్చికోలుఁ దగు! యన్యులె వారలు కౌరవేశ్వరా?"

"సోదరా! నీకుమారుఁడు దూరాలోచనము లేనివాఁడు. యుక్తాయుక్త కార్యము లెఱుఁగడు. పుష్పఫలభరితములును, సుందరములును, నత్యున్నతములు నగు వృక్షములను 'దయ మాలి బొగ్గులకై దహించుచున్న యంగారకారుని వలె నీకుమారుఁడు తుచ్ఛమగు ధనమున కాసించి యత్యుదారమగు కురుకులమును నశింపఁజేయుచున్నాఁడు. ఇఁక నీ వుపేక్షింపఁ జనదు. అధికదర్పముగల బలీవర్దములతోఁ బోరాడఁ గాలు ద్రవ్వు నక్కవలె నీకుమారుఁడు మహాబలాఢ్యులయిన పాండవులతో దర్పించి విరోధించుచున్నాఁడు."

> "అధిక దర్పయుక్త మగు బలీవర్దంబు
> నాగగణముతో రణంబు సేయఁ
> గాలు ద్రవ్వునట్లు గడు బలాఢ్యులతోడ
> నేచి వీఁడు విగ్రహింపఁ దొడఁగె."

"నీ వించుకయైన నాలస్య మొనర్పక యీ ద్యూతంబును వారింపుము." అని పలుదెఱంగుల హిత ముపదేశించెను.

రాజు విన్నను వినకున్నను నంత నిర్భయముగాను, నంత నీతి యుక్తముగాను, నంత ధర్మోపేతముగాను మాటలాడువాఁడు విదురుఁడు దక్క వేఱొక్కఁ డెవఁడు గలఁడు!

తన నీతివచనములు విని ధృతరాష్ట్రుఁడు మిన్నకుంటఁ జూచి విదురుఁడు మిక్కిలి పరితపించుచు దుర్యోధనునిఁ గాంచి యిట్లు పల్కెను. "ఓయీ! దుర్యోధనా! నీవు పాపమతివై న్యాయ మార్గమును విడిచి శకునిచే మాయాద్యూత మాడించి భరత వంశాలంకారులగు పాండుకుమారుల రాజ్యలక్ష్మి నపహరించు చున్నావు. ఇట్లు దుర్నీతిపరుఁడ వయి రాజ్య మపహరించిన జనులు నిన్ను ఛీ యని నిందింపరా?"

"న్యాయంబు విడిచి సౌబలు
మాయాద్యూతమునఁ బాపమతివై భరతా
మ్నాయు లగు పాండవేయుల
శ్రీ యిమ్మెయి గొనిన నిన్నుఁ జీయనరె యొరుల్."

మఱియుఁ బాండవులు మిక్కిలి ధైర్యవంతులు; శత్రువుల మద మడంపఁ జాలినబాహుబలము గలవారు. సింహపరాక్రమ వంతులగు నప్పాండవులతో నకారణముగా విరోధించి గర్వాతి శయంబున వారిని బరాజితులఁ గావించితివి. ఇట్టి బలవద్విరో ధము నీకుఁ దగదు. ఇది నీ కెంతమాత్రమును శ్రేయస్క రముగాదు" అని జంకునుగొంకును లేకుండ హితము బోధించెను.

నీటిబిందువులు తప్తతైలంబునకువలె నవ్విదురుని నీతివచన ములు సుయోధను కోపానలంబున కుద్దీపనంబులు కాఁగా నతఁ డోర్వఁజాలక నానావిధముల విదురుని నిందించెను. ఉత్సంగతల

మునఁ గూర్చుండఁ బెట్టుకొన్న క్రూరసర్పమువలెఁ గుడిచిన చోటికే యాపదగలిగింతువని ధిక్కరించిపల్కెను. నీవు మాకు బుద్ధిచెప్ప వలదని నిషేధించెను. ఈవిధమున దుర్యోధనుఁడు దన్ను దిరస్కరించినను విదురుఁడు భయభ్రాంతుఁడు కాలేదు. అతనికి హితోపదేశ మొనర్ప వెనుదీయలేదు. అతని కాఱు మాటలను సరకుగొనలేదు. అప్పుడు విదురుఁ డానుయోధనున కిట్లనియెను.

"దుర్యోధనా! నీవు దురాత్ముఁడవు. నీకు దురాత్ములే మిత్రులు. వారు నీకుఁ జెడ్డబుద్ధులు గఱపుచుందురు. అట్టివారే నీకుఁ గార్యాలోచనముఁ జెప్పువారు. వారిమాటలే నీకుఁ బ్రియమగును గాని మావంటివారి మాటలు నీకుఁ బ్రియము లగునా? మీవంటివారు ప్రియవాక్యములు చెప్పువారినే యాదరింతురు. అంతియకాని ప్రస్తుత మప్రియమయినను ముందు ముందు మేలుగలిగించు పలుకుల నుడువువారి నాదరింపరు. అందుచే నుత్తమప్రభువుల కయినను నట్టిపథ్యవాక్కులను నుడువరు. మొదట నప్రియ మైనను బిమ్మట మేలు గలిగించు మాటలను మోమోటము మాని పలుక వలయును. అట్లు పలుకువాఁడే రాజులకు ముఖ్యమిత్రుఁ డనఁదగినవాఁడు. నేను దాదృశ వచనములు పలుక వినకున్నావు."

"ప్రియము పలికెడువారిన పెద్ద మెత్తు
రప్రియంబును బథ్యంబు నైన పలుకు
దగిలి విననొల్ల రటు గాన దానిఁ బ్రీతిఁ
బలుక రెవ్వరు నుత్తమప్రభుల కైన."

“నేను ధృతరాష్ట్రునకుఁ గార్యములందు సహాయుఁడను. అట్టి నావచనములు వినక చెడుబుద్ధితో వర్తించుచున్నావు. పాండవులతోడి విగ్రహము నీ కెంతమాత్రమును లగ్గుగాదు” అని మోమోటము మాని నీతి నుపదేశించెను. దుర్మదంబున దుర్యోధనుఁడు తన్నుఁ దూలనాడినను సరకుగొనక తాను జెప్పవలసిన దంతయును జెప్పి విదురుఁడు తన యుత్తమత్వమును నిష్కల్మషత్వభావమును వెల్లడించెను. మంత్రులం దిట్టి సద్గుణుఁ డుండుట యరుదుగదా !

౫

దైవగతి కంతరాయము లేదుగదా! ద్యూతమును వారించుటకై విదురుఁ డెంత ప్రయత్నించినను నెంత బోధించినను లాభము లేక పోయెను. అందుచే ఖిన్నుఁడై విదురుఁడు సభాభవనమున మౌనియై యుండెను. ఇంతలో ధర్మరాజు జూదమున రాజ్యసంపదలనే కాక తన్నును, దన తమ్ములను దన భార్యను గూడఁ బణముగా నొడ్డి యోడిపోయెను. పాండవులను బత్నీసహితంబుగా గెలిచికొని దుర్యోధనుఁడు గర్వంబున మిన్నందుచు, నందులో, ద్రౌపదీదేవిచేఁ దన యింటిపనులు చేయింపఁ దలఁచి యామెను గొని తేవలయునని విదురు నాజ్ఞాపించెను. విదురుఁ డా వాక్యములను విని సహింపలేక యత్యంతము క్రుద్ధుఁడై “ఓయీ దుర్యోధనా! లోకములో నిన్నుఁ బోలిన యవివేకులు లేరు. దుష్టహృదయుఁడవగు నీ వీ నీచకృత్య మాచరించుటయే కాక నన్నుఁగూడ నా పని

యందు నియోగించుట తగునా? కండకావరమున మలినమగు చిత్తము గలవాఁడై పురుషుఁ డమితముగా ధూర్తకృత్యము లొనరించు నేని, నాతనిసంపద మిక్కిలి పెద్ద దయ్యును నందు వలన స్వార్జితమే కాక మొదలిఁటి సంపదకూడఁ దప్పకుండ నశించి పోవును.

మదమలినమనస్కుండయి
తుదిలేక వినయము చేయుదుర్జనునకు సం
పద పెద్ద దయ్యు నాతని
మొదలిఁటిసంపదయుఁ జెడు నమోఘము దీనన్.

ఓయీ! నీవు ద్రౌపది నవమానింపఁ జూచుచున్నావు. అది నీకుఁ దగదు. పాంచాలి సాధ్వీమణి; పరాక్రమశాలురగు పాండవుల ధర్మపత్ని; సకల సామ్రాజ్యమునకును బట్టమహిషి యై యొప్పుచున్నది. ఆమె నీచే నవమానము నొందుట కంత దిక్కు లేనిది కాదు.

అవనీతల సామ్రాజ్యో
త్సవమునకును యోగ్యయైనసతి ద్రౌపది పాం
డవధర్మపత్ని నీచే
నవమానము వొంద నింత యనపాశ్రయయే!

మఱియు నీవు పాండవులబలవిక్రమాదుల నెఱిఁగియు మూర్ఖుఁడవయి వారి కేల కోపముగల్గించెదవు? వారిని గుపితుల జేయుట కాలసర్పముల నలిగించుటయే కాదా? నీ వాపని విరమింపుము. మాయచే నితరులధన మహావరించుట ధర్మముగాదు. నీవు కుటిలాత్ముఁడగుశకునిమతము నవలంబించి యిట్టిపాప మొనర్చుట తగవుగాదు.

ఏల యాశీవిషంబుల నెఱిఁగియెఱిఁగి
మూర్ఖవై యలిగించెదు మొనసి యొరుల
ధనము నికృతమైఁ గొను టిది ధర్మమగునె?
శకునిమతమునఁ బాపంబు చనునె చేయ?

"జూదంబువలన నెగ్గు పుట్టునని మొదటినుండియుఁ జెప్పు చున్నాను. నీవు వినవయితివి. దీనివలనఁ గల్గుఫలము వేణు ఫలంబువలె సమూలనాశము గావింపక మానదు. కావున నిప్పు డయినను నామత మవలంబింపు" మని మఱిమఱి బోధించెను. ఇట్లు విదురుఁడు ప్రతి దుష్కార్యారంభమునందును దుర్యోధనునకును, ధృతరాష్ట్రునకును, హితోపదేశ మొనర్చు చునే యుండెను; కాని యవి వారితల కెక్కలేదు. అతని హితవచనములు విని సంతసించుటకు బదులుగా నతనిని బలువిధముల నిందించి సుయోధనుఁడు తనతలంచునది పూర్తి చేయుచుండెను.

అనంతరము దుర్యోధనుఁడు ప్రాతికామిచే ద్రౌపదిని సభకు రప్పించెను. ఆసాధ్వి దుఃఖితస్వాంతయై సభలోని కరుదెంచి సభ్యులను గాంచి "అయ్యా! ధర్మరాజు జూదమున ముందుగా నన్నోడి పిమ్మటఁ దన్నోడెనా; లేక ముందుగా దన్నోడియే నన్నోడెనా? ఇందులకు బదులు చెప్పుఁ" డని ప్రశ్నించెను. అందులకు సభ్యులందఱూరకుండ వికర్ణుఁడు తనబుద్ధికోలఁదిని దగువిధమున ధర్మనిర్ణయంబు చేయ నది తగదని కర్ణుఁడు నిరాకరించెను. అంత సుయోధను ననుమతంబున దుశ్శాసనుఁడు

ద్రౌపది కట్టువస్త్రమపహరింపఁ దొడఁగెను. దుశ్శాసను దుష్ట కృత్యముచూచిసహింపనోపక భీమసేనుఁడుభయంకరాకారుఁడై సమయోచితముగాఁ బ్రతినయొనర్చెను. మనుష్యమాత్రు లౌనర్వఁజాలని యీదుష్కార్యమునుగాంచి సభ్యులద్భుతపడుచు దుర్యోధను భయంబున ద్రౌపదివాక్యంబులు విచారింప కుపేక్షించిరి. కురువృద్ధులంద అట్లూరకుండుటఁజూచి విదురుఁడు సహింపలేక కన్నులనుండి యవిరళ బాష్పబిందువులు కురియుచు సభ్యులఁగాంచి యిట్లనియెను. "సభ్యులారా! మీరందఱును బుద్ధిమంతులరు. ద్రౌపది యడిగినప్రశ్నమున కర్థమును విచారింపుఁడు. ధర్మసందేహమును దీర్పనివాఁడు సభ్యులు పాపమును బొందకమానరు. ఈ వికర్ణుఁడు మనకంటెఁ బిన్నవాఁ డయ్యును బృహస్పతివలె ధర్మమును యథావిధిగా నేర్పఱిచి చెప్పియున్నాఁడు. మీరేవగింపక యీతనివచనములుగైకొనుట యుక్తము. మీరును నాలోచించి చూడుఁడు. బ్రహ్మదేవు సంతతివాఁడైన నొక్కరుఁడు ధర్మనిర్ణయమును జేయఁజాలఁడు.

ఈవికర్ణుఁడు బాలుఁడయ్యును నేర్పఱించి యథావిధిన్
దేశమంత్రియుఁబోలె ధర్మువు దెల్పె నీతనిబుద్ధి మీ
రేవగింపక చేకొనుం డిది యిట్టులెందును ధర్మస
ద్భావ మొక్కని కేర్పఱింపఁగ బ్రహ్మకైనను బోలునే!

"మఱియు నెవ్వరైనను సభకు వచ్చి ధర్మసందేహమడిగి సభ్యులెఱిఁగియుఁ జెప్పనివాఁడు వా రనృతదోష ఫలమునందు సగ మనుభవింతు రని ధర్మవిదులగు మునులు నిర్వచించిరి.

అంతియకాక ధర్మమును దెలిసియు సభ్యులు స్వలాభాపేక్షులై పక్షపాతబుద్ధితో నా ధర్మమును వేఱొకవిధముగాఁ బల్కినను వా రసత్యదోషఫలము ననుభవింతురు.

సభకు వచ్చి ధర్మసందేహ మడిగిన
నెఱిఁగి చెప్పకుండిరేని సభ్యు
లనృతదోషఫలమునం దర్ధ మొందుదు
రనిరి ధర్మవేదు లైన మునులు.

ధర్మ మెఱిఁగి దాని దా నొండుగా లాభ
లోభ పక్షపాత లోలబుద్ధి
సభల నెవ్వఁడేని సభ్యుఁడై పలుకువాఁ
డనృతదోషఫలము ననుభవించు.

“ ఈయర్థ మితిహాసంబులందును వినఁబడుచున్నది.

ప్రహ్లాదుఁడు ధర్మనిర్ణయ మొనర్చుట

“ పూర్వము ప్రహ్లాదునికుమారుఁ డగువిరోచనుఁడును నంగిరసుని పుత్త్రుఁడగు సుధన్వుఁడును నొక్కకన్యను ప్రేమించిరి. దానివలన వారికి విరోధ ముత్పత్తిల్లెను. వారిలో నెవ్వఁ డధిక గుణవంతుఁడో వాఁ డాకన్యను జేపట్టుటకు వారిరువురు నంగీకరించిరి. కాని నేనే గుణవంతుఁడ నని యొకఁడును నేనే గుణవంతుఁడ నని రెండవవాఁడును మరలఁ గలహింపఁజొచ్చిరి. తుదకు వారొకనిర్ణయమునకువచ్చిరి. నేను సుగుణవంతుఁడను. అట్లుకానిచోఁ బ్రాణత్యాగము చేసెదనని యొకఁడనెను. రెండవవాఁడును నట్లేపలికెను. ఇట్లువారు ప్రాణములుపణంబుగా

నొడ్డి తమతమ గుణశ్రేష్ఠత్వమును నిర్ణయించుకొనఁ బ్రహ్లాదుని కడకేఁగిరి. అపుడు సుధన్వుఁడు బ్రహ్లాదునిఁగాంచి "మహానీయా! నీవు ధర్మవిదుఁడవు. మా వివాదమునుదీర్ప నీవే సమర్థుఁడవు. నీకుమారుఁడే గుణశ్రేష్ఠుఁడో నేనే గుణశ్రేష్ఠుఁడనో యోచించి చెప్పుము. నీవు పక్షపాతముతో ధర్మనిర్ణయ మొనర్తువేని యింద్రుని వజ్రముచే నీశీర్షము శతథా భిన్నమగుఁగాక" యని పలికెను. అందులకుఁ బ్రహ్లాదుఁడు భయపడి తాను సరిగా ధర్మనిర్ణయముఁ జేయఁగల్గునో లేదో యని సందేహించి కశ్యప మహర్షిని సమీపించి విరోచనసుధన్వుల వివాద కారణమును వారి పన్నిదంబులను దెలియఁబఱచిన గశ్యపుఁ డిట్లు చెప్పెను. "మహానీయా! సాక్షియును ధర్మదర్శియును సభలం దెప్పుడు నసత్య మాడరాదు. అట్లుధర్మ మాచరించెనేని వరుణపాశ సహస్రము వానిని గట్టి ప్రతివత్సరంబును బాధించును. కావున బాగుగా నాలోచించి ధర్మాధర్మముల నిర్ణయింపవలయును. ధర్మాధర్మములకు విరోధము సంభవించినపుడు సభ్యులు దానిని దీర్పరేని-చో ధర్మవిరుద్ధులగుదురు. కామక్రోధపీడితులై సభ్యులు పక్షపాతంబున నధర్మము నిరూపించినచో న్యాయధర్మమునం దొక్క పాదంబు సభ్యులను బొందును. మఱియొక పాదము సభాధిపతిని బొందును. తక్కిన రెండుపాదములును గర్తను బొందును కావున ధర్మంబును దప్పక చెప్పవలయు" నని పల్కెను. అదివిని ప్రహ్లాదుఁడు నిశ్చలబుద్ధితో ధర్మవు విచారించి తనకొడుకుకంటె సుధన్వుఁడే గుణాధికుఁడని నిర్ణయించిచెప్పెను.

అది విని సుధన్వుఁడు పుత్త్రస్నేహమువిడిచి నిష్పక్షపాతముగా ధర్మనిర్ణయము గావించినందుల కానందించి ప్రహ్లాదుని నుతించి యతనిపుత్త్రునికిఁ బ్రాణదానంబొసఁగి సంతసమున నరిగెను. ప్రహ్లాదుఁడెట్లు నిష్పక్షపాతబుద్ధితో ధర్మసందేహముఁనుదీర్చెనో యట్లే మీరును ద్రౌపది యడిగిన ధర్మసందేహములు దీర్చి ధర్మమార్గము ననుసరింపుఁ" డని విదురుఁడు సభ్యులను హెచ్చరించెను. కాని యేమియును బ్రయోజనము లేకపోయెను. దుర్యోధను భయంబున సభ్యులెవ్వరును మాటాడలేకపోయిరి. తన యత్నమునకు ఫలము గలిగినను కలుగకున్నను విదురుఁడు సభలోఁ వర్తిలుచున్న యధర్మమునుఁజూచి సహింపలేక తన విహితకృత్యము నాచరించెను.

అనంతరమున భీముఁడు ఘోరప్రతిజ్ఞ లొనర్చెను. దానికి భయపడి గాంధారీ ధృతరాష్ట్రులు ద్రౌపదినిబిలిచి వరంబులిచ్చి తన్మూలంబునఁ బాండవుల సకలసంపదలను వారికిఁజెందఁజేసిరి. పిమ్మటఁ బునర్ద్యూతంబు ప్రవర్తిల్లుటయు నందొడ్డుకొన్న పణంబు ప్రకారము పాండవులు రాజ్యసంపదలను విడిచి వనవాసంబున కరుగుటయు సంభవించెను. తానెంత వారించు చున్నను నిరర్గళంబై వచ్చు నాపదకు మిక్కిలికుందుచు విదురుఁడు పాండవుల నోదార్చి యిట్లనియెను. "ధర్మరాజా! నీతల్లి కుంతీదేవి పెద్దది. మిక్కిలి సుకుమారి. వనవాసక్లేశ మామె యోర్వలేదు. ఎల్లప్పుడును భక్తిపూర్వకముగా బూజితురా లగుచు నాయింట నుండును. నీ వందుల కంగీకరింపుము. నీవు

ధర్మజ్ఞుఁడవు. భీముఁడు మిక్కిలి పరాక్రమశాలి. అర్జునుఁడు మహాతేజశ్శాలి; యుద్ధవిశారదుఁడు. నకులుఁ డర్థజ్ఞుఁడును బుద్ధిశాలియు నని చెప్పనొప్పును. సహదేవుఁ డెంతయును సంయమవంతుఁడు. ఆలోచింప నీసోదరులందఱును నిట్టి సద్గుణ గణాఢ్యులు. మీ ప్రియురాలగు ద్రౌపది ధర్మములందును, గార్యములందును నిపుణురాలు. మీపురోహితుఁడగు ధౌమ్యుఁ డధ్యాత్మవిద్యయందు సుప్రసిద్ధుఁడు. ఇట్టి మీకు లోప మెట్లు సంభవించును? మీరందఱును బరస్పరము హితులగుటచే మిమ్ములను లోకు లాదరించి గౌరవింతురు; కాని భేదింప సమర్థులు కాఁజాలరు. ఇంతేకును ధైర్యవంతులగు మిమ్మెవ్వరు నిర్జింపఁగలరు? మీరు కృష్ణద్వైపాయనునిచే శిక్షితులరు. శ్రీకృష్ణభగవానునిచే రక్షితులరు. ధౌమ్యమహర్షి మీకు బురోహితుఁడయి మిమ్ముల సన్మార్గమున నడిపించుచున్నాఁడు. దైవపౌరుషములందు మీరసమానులు. మీరు పరాక్రమమున రాజులను జయించినారు. ధర్మప్రవర్తనముచే ఋషుల నతిక్ర మింపఁ జాలినవారు. మహామహిమచేఁ గుబేరాదులను ధిక్కరించినవారు. ఇట్టి మీకు నపాయము గల్గింప నెవ్వరు సమర్థులు? ఇఁక మీరు విచారవిముఖులై ధైర్యమవలంబించి యుండుఁడు. మిమ్మెప్పుడును భూమియును, బవమానుఁడును, జంద్రాదిత్యులును రక్షించుచుందురుగాక! ఎల్లకార్యములందును జాగరూకులై మీరు వర్తింతురుగాక! మనకుఁ బరస్పరమును బునర్దర్శనమగుఁగాక! ఇఁక నరుగుఁ" డని హితోపదేశముచేసి

పాండవులను సాగనంపెను. విదురుఁడు పల్కిన ధీరవచనములు విన్నచో దుఃఖ మింక నెవ్వారిహృదయములందుఁ గాఁపుర ముండును! ఆపన్నులు రాజ్యభ్రష్టులు నగు పాండవు లవ్వచన ములు విని దుఃఖముదొలఁగించికొని ధైర్యవంతులై ప్రవర్తింపఁ జొచ్చిరి. కష్టసుఖములందు సమముగా నుపదేశించువాఁడే కదా హితుఁ డనఁదగువాఁడు! అట్టి సుగుణము విదురునకు దోడఁ బుట్టినదని చెప్పుటకు సందేహములేదు.

విదురుఁడు ధృతరాష్ట్రునకుఁ బాండవు లడవి కరిగినరీతిని జెప్పుట

విదురుఁడు సమయోచిత బుద్ధిగలవాఁడు. అపమార్గమున నడుచువారిని మంచిత్రోవకుఁ గొనిరా నయంబున భయంబున బ్రయత్నించును. పాండవుల కపకారంబు చేయవలదని యతఁ డిదివఱకు వినయపూర్వకముగా ధృతరాష్ట్రున కుపదేశించెను. ఇప్పు డతఁ డారాజునకు భయము జనించున ట్లుపదేశింపనెంచెను. పాండవు లడవి కేఁగినపిమ్మట ధృతరాష్ట్రుఁడు విదురునిఁ బిలిచి పాండవు లెట్లేఁగిరో చెప్పుమని యడిగిన నీగతి విన్నవించెను. "రాజేంద్రా! ధర్మరాజు వస్త్రాంచలమున ముఖము గప్పు కొని యిటనుండి కదలిపోయెను. భీముఁడు భయంకరములగు తన బాహువులను రెండింటిని పెద్దలుగాఁ జేయుచు నరిగెను. అర్జునుఁ డిసుముచల్లుచుఁ బోయెను. భూపరాగమును శరీరము నకుఁ బూసికొనుచు నకులుఁ డరిగెను. సిగ్గునఁ దల వంచి కొనుచు సహదేవుఁడు పోయెను. ద్రౌపదీదేవి దుశ్శాసనునిచే ద్రెవ్వఁబడి వికృతములగు కేశములను జీరాడఁ జేయుచుఁ బోయెను.

ధౌమ్యుఁడు భయంకరములై యముఁ డధిదేవతగాఁ గల సామమంత్రములను జదువుచుఁ బోయెను. ఇదిచూచి పుర ప్రజలందఱు నాశ్చర్య రసమగ్నమానసు లయిరి. వారవ్వి ధంబున నరుగుటకుఁ గారణ మేమని యడుగుదేని వినుము. ధర్మరాజు నీకొడుకులవలనఁ బరాభవమును, రాజ్యభ్రంశ మును బొందినాఁడు. దానివలన నతనికిఁ గోపము మిక్కుటమయ్యెను. క్రోధానలపూరితములగు తన చూపులను బఱపినచోఁ బ్రజలు దగ్ధులై పోవుదు రేమో యను భయమునఁ దన కొరులు గనఁబడకుండ వస్త్రాంతరితముఖుఁ డయ్యెను. శత్రుభయంకరుఁ డగు భీముఁడు యుద్ధములోఁ దన బాహు దర్పము చూపఁదగిన యవకాశము లభించినదని బాహువులు విస్తృతములు గావించుచుఁ బోయెను. ఇసుముకంటెను దఱుచుగా బాణములను బ్రయోగించి శత్రు సంహారమును గావించెద నన్న యభిప్రాయమును సూచించుచు నర్జునుఁ డరిగెను. దుఃఖానుభవంబున కెంతమాత్రమును దగని తన సుందర రూపమును జూచి ప్రజలు దుఃఖింపకుండుటకై నకులుఁడు ధూళిధూసరితశరీరుఁడై పోయెను. కడుదీనమైన తన ముఖంబు గాంచినవారి కెగ్గు సంభవించునని యూహించి సహదేవుఁ డొరులకుఁ దన వదనమును జూపకుండ నధోముఖుఁడై యరిగెను. ద్రౌపదీదేవి తడిసిన యేక వస్త్రమును దాల్చి మూఁడువని కేశ పాశముతో దుఃఖాతిశయమున నొగులుచుఁ బోవుటలో నభి ప్రాయ మేమందువా? ముందు జరుగనున్న మహాయుద్ధమున

నిజబంధువులను బోఁగొట్టికొని శోకముతోఁ గౌరవభామిను లిట్లే పోవుదురని సూచించుటయే.

> తడసిన యేకవస్త్ర పరిధానముతోఁడ విముక్తకేశయై
> తొడరుచు దుఃఖభావమున ద్రోవదివోయె మహాహవంబునన్
> బడిన నిజేశ మిత్ర సుత బంధుజనంబుల శోకవేదనన్
> గడుకొని యిట్లు లేగుదురు కౌరవభామిను లంచు దెల్పుచున్.

ఘోరతరణమునఁ గూలిన కౌరవశూరులకుఁ బరలోకవిధు లను సూచించుటకై ధౌమ్యుఁడు రౌద్రయామ్య మంత్రముల నుచ్చరించుచుఁ బోయెను. వారివారి యభిప్రాయంబులెట్లు న్నవో చూడుము."

అద్దివిని ధృతరాష్ట్రుఁడు దుఃఖింపఁ దొడఁగెను. పాండవుల యథార్థవృత్తాంతమును దెలిపి ధృతరాష్ట్రునకు దుఃఖముగల్గిం చుటలో విదురుని యభిప్రాయము వేఱు. మహాబలశాలురగు పాండవుల వలనఁ దన కుమారులకుఁ గీడు మూడునేమో యన్న భయమున ధృతరాష్ట్రుఁడు పాండవులను వనమునుండి రప్పించి వారి రాజ్యమును వారికొసఁగక పోవునా యని విదురుని తలంపు. అందులకే పాండవుల యభిప్రాయంబు లిట్టివని తెలిపెను. కాని ధృతరాష్ట్రుఁ డట్టి వివేకసంపదగలవాఁడు కాఁడు. పుత్త్రవ్యామోహమ్మున గర్తవ్యమును మఱచి వర్తించువాఁడు.

విదురుని మాటలువిని ధృతరాష్ట్రుఁడు "మహాశూరులగు పాండవులతో వైరము బెట్టుకొంట మిక్కిలి యనర్థము. అది

ప్రజాసంక్షయకారి కాక మానదని మిక్కిలి భయమంది వేడి నిట్టూర్పు పుచ్చుచు సంతాప పడఁజొచ్చెనే కాని పాండవుల నడవులనుండి రప్పింప యత్నింపఁ డయ్యెను. అప్పటికి విదురుఁ డూరకుండక "రాజేంద్రా! ఇట్లు దుఃఖించుచుంటవలనఁ బ్రయోజనములేదు. వెంటనే పాండవులను బిలిపించి వారి రాజ్యము వారికొసఁగుము. మీరు కపటముచే వారిరాజ్య మపహరించినారు. ఇట్లు చేయుట మీవంటివారికిఁ దగునా? పరుల సంపదల నట్లు మోసముచేఁ గొన్నచో నుత్తము లెవ్వరైనను మెచ్చుకొందురా?

వగపనేటికి నింకనైనను వారలం బిలిపించి యీ
జగతి నెప్పటియట్లు యేలుచు సంతసంబున నుండఁగా
జగదధీశ్వర పంపు వంచన సన్నె యన్యుల సంపదల్
మిగిలి చేకొన నట్లు చేసిన మెత్తురే మది నుత్తముల్.

కావున నిప్పుడయినను నా చెప్పినచొప్పున నడువుము. అంత మాత్రమునఁ గాలాతిపాతము కాలేదు." అని బోధించెను. ఇట్లు విదురుఁడు ప్రతిసమయమందును ధృతరాష్ట్రుని చెవినిల్లు కట్టికొని హితముపదేశించెను. మంత్రిసత్తముఁ డింతకంటె నేమి చేయఁగలఁడు? కౌరవపాండవులకు భేదము కలుగకుండ విదురుఁడు మొదటినుండియు జేసిన యత్న మింతింతనరాదు. కాని లాభమింతేనియు లేకపోయెను. పూర్వజన్మకర్మము విపద్రూపమై ధృతరాష్ట్రునికిఁ గట్టి కుడుపుచుండఁ దప్పింప నెవ్వరు సమర్థులు? ఎట్టి మహానుభావులయినను గర్మపాశము నతిక్ర

ఖింపఁ గలరా ? అన్ని నీతివచనములు వినియు విననట్లువర్తించి ధృతరాష్ట్రుఁడు పాండవాన్వయమునం . దుపేక్షాపరుఁడయి వర్తించెను.

౬

పాండవులు వనమున కరిగిన పిమ్మట ధృతరాష్ట్రుఁడు విదురు నొకనాఁడు రప్పించి యతనిం గాంచి "ఓయీ ! నీవు భార్గవుని కంటెను బుద్ధిమంతుఁడవు. పాండవ కౌరవులందు సమానాదరము గలవాఁడవు. బాగుగ నాలోచించి పాండవులిప్పు డేమిచేయు వారో వివరించి చెప్పు" మని యడిగిన విదురుఁ డిట్లనెను :—

"'మహారాజా ! పాండవులు దేవతామహిమ గలవారు. నిశ్చల మనస్కులు. వారి గొప్పతనము నీకుఁ దెలియునది కాదు. వారిలో భీమార్జునులు ఘనకార్యము లాచరించి తమ బాహుపరాక్రమమును వెల్లడించినారు. నానావిధాస్త్ర విద్య లందుఁ బారంగతులు. యుద్ధములందు శత్రువీరులను సామా న్యముగా వారు మిగులనిత్తురా ?

దేవమూర్తులు పాండుపుత్రులు ధీరచిత్తులు వారి పెం
పీ వెఱుంగనివాఁడవే ధరణీశ వాయుసుతుండు గాం
డీవియున్ భుజవిక్రమప్రకటీకృతుల్ వివిధాస్త్ర వి
ద్యావిశేషులు వైరవీరులఁ దక్కనిత్తురె పోరులన్.

"ద్యూత మెంతమాత్రము నాడరాదు. అది యధర్మము నకుఁ గారణమైనది. దానివలనఁ బాండవులకును నీ కుమారుల

కును వైర ముప్పతిల్లక మానదు. వలదు వలదు, ద్యూతము వలదని యెంతబోధించినను నా మాటలు వినక నీ కొడుకు మాటలు విని యధర్మమార్గమును బట్టితివి. దానివలన మనకు మేలు గలుగనేరదు. కావున నిప్పుడైనను పాండవుల రప్పించి తొల్లి నీవొసఁగిన యర్ధరాజ్యము వారికిచ్చి యాదరింపుము. దానివలనఁ గీర్తియును ధర్మంబును నెగడును. రాజ్యమునకును త్రివర్గమునకును ధర్మమె హేతుభూతము. కాన రాజ్యాధిపతి ధర్మమార్గము ననుసరించునది. ఇట్లుండ నీ కొడుకు కర్ణశకుని దుశ్శాసనబోధితుండై యధర్మమార్గమునఁ జరించుచున్న వాఁడు. తద్వర్తనమును నీవంగీకరింపరాదు. వీని జననసమయమునఁ బెక్కు లుత్పాతంబులు వాటిల్లెననియు వీనివలనఁ గౌరవుల కెగ్గు జనించుననియు నేసిదివరకు పలుమారు చెప్పియున్నాను. కులదూషకుఁడగు దుర్యోధనుని బరిహరించి కులమును రక్షించికొమ్ము. ధర్మరాజును రప్పించి సకల మహీరాజ్యంబునకుఁ బట్టముగట్టి పుత్రపౌత్రాదిబంధువర్గంబుల నెల్ల రక్షింపుము. సభామధ్యమునందు ద్రౌపదీభీమసేనులఁ బ్రార్థింప దుశ్శాసనునిఁ బంపుము. దానివలన వారు కోప ముడిగి మన వారి నాదరింతురు. ధర్మరాజు మహర్షివంటివాఁడు; పరమ శాంతుఁడు; అజాతశత్రుఁడని సార్థకనామధేయము గలవాఁడు; భానుసంకాశ తేజుఁడు. నీ విట్లొనరించితివేని ధర్మరాజు నీ కుమారులొనర్చిన యెగ్గులను దలంపఁడు. ఇందువలన వైరము నశించును. నీవలనఁ గౌరవవంశము భూమిపై నిలిచి మిక్కిలి కీర్తితోఁ బ్రకాశించును.

అతిశయతాపసోత్తముఁ డహర్పతితేజుఁ డజాతశత్రుఁ డూ
ర్జితుఁ డజితుండు నీసుతులు చేసినయెగ్గు దలంపఁ డాతనిన్
ధృతి నమనీతుఁ జేయుము ప్రతీపకులోత్తమ యిట్లు లైన నీ
కృతమునఁ గౌరవాన్వయ మకిల్బిషకీర్తిఁ బ్రకాశితం బగున్.

ఆవాక్యములకు ధృతరాష్ట్రుఁడు కనలి విదురునిఁ గాంచి "విదురా! మాటిమాటికిని దుర్యోధనుని విడిచిపుచ్చుమని చెప్పెదవు! నా కుమారులయందు వాఁడే జ్యేష్ఠుఁడు. వాని నే నెట్లు విడువఁగలను? కన్నకుమారులను గాదని బహిష్కరించు కఠినహృదయులు లోకమున నుందురా? నీవు యుక్తాయుక్తము లరయక యిట్లనుచుంట యుచితమా? నీవు నా కొడుకులయున్నతి నోర్వఁజాలవు. నీసహాయత నిఁక నిష్టపడను. నీవు పాండవులకడకైన, కాక మఱియొకచోటికైనను బొమ్ము; ఇఁక నాయొద్ద నుండకు" మని నిందించి పలికెను.

విదురుఁడు ధృతరాష్ట్రుని విడిచి పాండవులకడ కేగుట

అది విని విదురుఁ డా పరాభవమును సహింపఁ జాలక యాక్షణమే రథారూఢుఁడై కామ్యకవనమందున్న పాండవుల చెంత కరిగెను. అట్లు వచ్చుచున్న విదురునిఁ గాంచి పాండవులు తమలో "ఓహో! ఆవచ్చునది విదురుఁడు. అతఁ డిట్లు వచ్చుటకుఁ గారణ మేమైయుండును? గాండీవాదులగు మన యాయుధముల నప్పుడు దుర్యోధనుఁడు పుచ్చికొనన మఱచి యితనిని బంపెను గాఁబోలు; లేనిచో నిట్లితఁడేలవచ్చు" నని తలపోయుచుఁ బోయి విదురు నెదుర్కొని యతనిని బ్రియ

నత్కారంబుల సంతుష్టుని గావించి తదాగమనకారణంబడిగిరి. అప్పుడు విదురుఁ డిట్లనియె. "ధర్మరాజా! ధృతరాష్ట్రుఁడు నన్నుఁ 'గార్యస్థితిని దెల్పవలయు' ననికోరెను. అందులకు నేను హిత ముపదేశించితిని. సర్వజనరుచిరంబగు నాహారము రోగాతురునకుఁ బోలె నాహితవచనములతనికి రుచింపవయ్యెను. కార్యపరిస్థితులను గుఱించి యున్న దున్నట్లు వచించినచో నధికమతులు దాని నాదరింతురు; అల్పబుద్ధులు నిరసింతురు. అది వారికి విషమువలె నప్రియమగును.

> కార్యగతుల తెఱఁగు కలరూపు చెప్పిన
> నధికమతులు దాని నాదరింతు
> రల్పభాగ్యబుద్ధు లగువారలకు నది
> విరస కారణంబు విషముఁబోలె.

నావచనములు వినకపోవుటయే కాక ధృతరాష్ట్రుఁడునన్ను నిందించి పొమ్మనిన మీచెంతకు వచ్చితిని. వృద్ధశ్రోత్రియ వివాహితయు, రూపలావణ్యవతియు నగు తరుణివోలె రాజ్యలక్ష్మి దురాత్ముఁడగు దుర్యోధనునియం దనురక్త కాఁజాలదు! ధర్మరహితులగు ధార్తరాష్ట్రులకు రాజ్యలక్ష్మి యెంతమాత్రము దక్కదు. తద్రాజ్యసంపదలు నిన్నుఁ బ్రేమించి తమంత తామేవచ్చి చేరును. సందియమ్ము లే" దని పల్కినఁ బాండవులు సంతసించిరి. విదురుఁ డచ్చటనే నివసించెను.

ధర్మాధర్మవిదుఁడును, హితవాదియు, సహాయియునగు విదురుని విడిచి ధృతరాష్ట్రుఁ డొక్కఁడు క్షణమయిన నుండఁ

గలఁడా ? మఱియుఁ జెంతనున్నప్పుడు వస్తువువిలువ తెలియదు. అది దూరస్థమగునేని మిక్కిలి ప్రియమగును. అట్లే ధృతరాష్ట్రుఁడు చెంతనున్నంతకాలమును విదురుని గొప్పతనముగ్రహింపలేక తద్వియోగమునందు సులభముగాఁ గ్రహింపఁగల్గెను. అనంతరము ధృతరాష్ట్రుఁడు సంజయునిఁబంపి విదురుని రప్పించికొని వినయవినమితోత్తమాంగుఁడై యతనిఁ గౌఁగిలించుకొని యాదరించి "విదురా! నీవు నిత్యక్షమావంతుఁడవు. నీ హితమును వినక నిన్ను నిందించి యపరాధము గావించితిని. క్షమింపు" మని వేడుకొనియెను.

విదురుఁడు సంతుష్టుఁడై ధృతరాష్ట్రునితో "మహారాజా! మీనిందావాక్యములకు నేను దుఃఖితుండనుగాను. మీ హితమును గోరువాఁడను. నీవును, నీకుమారుఁడును న్యాయరహితులై యోజనాదూరులై నన్నెంతనిందించినను నేను మీకుఁ బథ్యవచనములను మాత్రమే యుపదేశించెదను. పాండవేయులతో విగ్రహంబు మీకెంత మాత్రమును దగదు.

నీవు నీసుతుండు నెఱిఁదప్పి పలికినఁ
బథ్యమైనపలుకుఁ బలుక వలయు
వీరులైనపాండవేయులతో విగ్ర
హంబు సేయు టిది నయంబుగాదు."

అని బోధించెను. ప్రభువునకెక్కడ కోపము వచ్చునో యని సంకోచింపక యథార్థములగు నీతివచనముల నుపదేశించుటలో విదురునిఁబోలిన యుత్తమపురుషుఁ డింకొకఁడుండఁ డని చెప్పవచ్చును.

అనంతరము విదురుఁడు తొంటియట్ల కార్యసహాయుఁడై ధృతరాష్ట్రుని యొద్దనే నివసింపఁజొచ్చెను.

౭

బుద్ధిమంతులు తాము చెప్పవలసిన దంతయుఁ జెప్పి యెదుటి వార లప్పటికిని సన్మార్గావలంబులు కానిచో నిఁక వారల చేట్పాటు దైవనిర్ణీతమనియు, దానిఁ దొలఁగింప మనుష్య మాత్రుల కశక్యమనియుఁ దలంచి యూరకుందురు. ఇవ్విధమ్ముగ విదురుఁ డదేవిధమున నడిచెను. ధృతరాష్ట్ర దుర్యోధను లకుఁ జెప్పఁదగినంత వట్టు హితమును జెప్పెను. వా రిరువురును దనమాటలను బాటింపక పోవుటయేకాక మీఁదుమిక్కిలి తన్ను నిందించి పలికిరి. ఇఁకఁ దన యుపదేశము నిరర్థకమని తలఁచి యది మొదలతఁడు వా రడిగినఁ దప్పఁ దనకుఁ దా నుపదేశింప మానికొనెను. అయినను వారియెడఁ గినుక వహింపక వా రడిగినప్పుడు నిర్మలచిత్తముతో సదుత్తరము లిచ్చుచుండక పోలేదు. విదురుఁడు పాండవపక్షపాతి యని నమ్మియుండుటచే దుర్యోధనుఁ డతని యాలోచనమును గొనలేదు. కాని ధృతరాష్ట్రుఁడు మాత్రము విదురునితో యోజింపకుండ నొక్క కార్యము నాచరింపలేదు.

సంజయుఁడు రాయబారమునడపి వచ్చి ధృతరాష్ట్రునిఁగాంచి యతని దుష్ప్రవర్తనమును గుఱించి కొంత నిందించి మఱునాఁ డుదయమున వచ్చి రాయబారపు వృత్తాంతము చెప్పెదనని పలికి

వెడలిపోయెను. అదిమొదలు ధృతరాష్ట్రున కేమియును దోఁచదాయెను. రాత్రి నిద్రపట్టలేదు. అందుచే నతఁడు విదురునిఁ బిలిపించి సంజయుని రాక దెలిపి "విదురా! ఎందుచేతనో నా చిత్తము కలఁగిపోవుచున్నది. నా శరీరము నిప్పులలోఁ బొరలుచున్నట్లున్నది. కంటికి నిద్రరాకున్న" దని పలికిన విని విదురుఁ డతని కిట్లనియె. "ఓ మహారాజా! బలవద్విరోధము గల్గించుకొన్న బలహీనునకును, ధనము గోలుపోయినవానికిని, పరద్రవ్యము హరింప వేచియున్నవానికిని, కామాంధునకును నిద్రపట్టదు. ఈయాపదలలో నేదోయొకటి నీ చిత్తమునకుఁ దగిలియుండనోపు లేక పరులసొమ్ము హరింపఁ దలఁచియుండీవలెను. కానిచో నీకేల నిద్రరాదు? నీలోని తలంపు వెల్లడింపు" మని పలికెను.

బలవంతుఁడు పైనెత్తిన
బలహీనుఁడు ధనము గోలుపడిన యతఁడు ద్రవ్యము
చ్చిల వేచువాఁడు గాముఁడు
కులచిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా!

ఇక్కారగాములలోపల
నొక్కటి నీచిత్తవృత్తి నొందదుగదా యొరుసొ
మ్మొక్కటిఁ గుడువఁ దలంచితొ
నిక్కము గతమేమి చెప్పు నిద్రచెడుటకున్.

ధృతరాష్ట్రుఁ డదివిని "ధర్మరాజు సంజయునితో నేమి పలికెనో తెలియక యిట్లయితిని. నీ వాలోచించి యా విష

యమును జెప్పి నాచింతను బాపు" మని పలికెను. అందులకు విదురుఁ డిట్లనియెను.

విదురుఁడు ధృతరాష్ట్రునకు ధర్మరాజుమతమును జెప్పుట

"రాజేంద్రా! ధర్మరాజు సత్యవంతుఁడు; శాంతమూర్తి. వినయమునందు వివేకమునందు సుశీలమునందు నాతఁడు సుప్రసిద్ధుఁడు. అతఁడు నీకు జుట్టము; తగిన సేవకుఁడు; మంత్రి కాఁదగినవాఁ డనుటకు సందియము లేదు. అట్టివాఁడు నీకుఁ గీడెన్నఁడును దలంపఁడు. నీవును నీకొడుకును న్యాయమును విడిచి యతనిఁ బరాభవించితిరి. ఇప్పు డయి నను వారి కుచితమగు రాజ్యభాగమును బంచియిుండు. 'పిల్లి పట్టిన మాంసమువలె మీరు రాజ్యమంతయు నొడిసిపట్టికొన్న యెట్లు చెల్లును?

"నీవు గొడుకు వారి నెటి లేకొ పటిచితి
రదియ చాలు నుచితమైన పాలు
పంచి యిందు, పిల్లి పట్టిన యీరువు
చేసి యున్న నేల చెల్లనేర్చు?"

"మఱియు మీరు కర్ణశకుని దుశ్శాసనులపై రాజ్యభారము మోపి తదిష్టానుసారముగఁ బ్రవర్తించుచున్నారు. కాని వారివలనఁ గార్యభారము కొనసాగ నేరదు. తమ్ముఁడాము దెనిసికొనుటయు, వేగపడకుండుటయు, నోర్పును, బట్టినపట్టును సమయానుగుణముగ విడిచిపుచ్చుటయు, నను నీగుణము లమాత్యు లకు ముఖ్యము...

తముఁడా రెఱుఁగుట వేగప
డమి తాలిమి విడుపు గలుగుటయు లేని ప్రభు
త్వము గలదె వారియం దీ
సు మానుషము లొకఁడు పట్టి చూడంగలమే ?

అట్టివారివలన రాజకార్యములు దీఱునా ? ధర్మరాజు నిన్ను నిక్కపుజనకునిగా భావించును. కనుకనే మీరన్యాయ మొనర్చి నను సహించి యున్నవాఁడు. ఈ యంశము నీవును నెఱుఁగుదు" వని పలికెను.

అది విని ధృతరాష్ట్రుఁడు సంజయునివలన రాయబారపు వృత్తాంతమును దెలిసికొని చేయవలసిన కార్యమును నిర్ణయించి హితభాషణములచే నా హృదయసంతాపమును బాపుమని ప్రార్థించెను. అదివిని విదురుఁ డిట్లనియెను.

విదురుఁడు ధృతరాష్ట్రునకు నీతి నుపదేశించుట

రాజు లోకుల కనుకూలమగు విధమున నడచుచు లోక గర్హితము లగువానిని విడిచి పరుల కలిమికి మత్సరపడక మనుజులతోఁ గలసి మిత్రభావమున వర్తించుట మిక్కిలి మంచిది. కోపమును, సంతోషమును, గర్వంబును, నసంతృప్తియు, దురభిమానంబును, నిర్వ్యాపారతయు నననవి దుర్గుణంబులు. ఇవి కాపురుషులం దుండఁదగినవి, కాని యుత్తరపురుషులకుఁ దగవు.

జనులకు నొడఁబా టగువిధ
మున నడచుచు లోక నింద్యముల నుడుగుచు మీ
తిన యొకనికలిమి కులుకక
మనుజులతోఁ బొందు పొసఁగి మనుటొప్పు నృపా !

యుపదేశములు

కోపము నుబ్బును గర్వము
నాపోవనియునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము ననునవి
కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా!

తమ ప్రభువును, దైవమును, భార్యను, బంధుగులను దగిన పూజలచే సంతసింపఁ జేయుని యవివేకు లందునకుఁ దగిన దుష్ఫలమునే చెందుదురు. లోకములో సుఖమెఱుంగనివారు దమ్ము ప్రేమించువారిని ప్రేమింపరు. తమ్ము ప్రేమింపనివారి నాశ్రయించి వారివెంటఁ దిరుగుదురు. ఇతరుల గొప్పతనమును గాంచి యట్లుండ నాసక్తు లగుచుందురు. ధనమును, విద్యయు, వంశంబును, దుష్టులకు మదంబు గలిగించును. అవియే సజ్జనులకు వినయమును నమ్రతను గల్గించును.

ధనమును విద్యయు వంశం
బును దుర్మదులకు మదంబు బొనరించును స
జ్జను లైనవారి కడఁకువ
యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా!

విలుకాని తీవ్రబాణ మొకప్పుడు లక్ష్యమునుండి తొలఁగి పోయినఁ బోవచ్చు కాని నేర్పరియగు నీతిజ్ఞుని నీతిప్రయోగము తప్పకుండఁ బరరాజును రాజ్యముతోఁగూడ నశింపఁజేయును. వివేకవంతుఁడగువాఁ డొకటియగు బుద్ధిని జేకొని కార్యాకార్యముల రెంటిని నిశ్చయించి మిత్రుఁడు నుదాసీనుఁడు శత్రువు నను మువ్వురను సామదాన భేద దండోపాయము లనెడి నాల్గింటిచే

వశపఱచుకొని త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము ననెడి జ్ఞానేంద్రియము లైదింటిని జయించి సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధీభావము, సమాశ్రయణము నను నాఱింటిని దెలిసికొని, వెలఁది, జూదము, పానము, వేఁట, వాక్పారుష్యము, దండపారుష్యము, వృథావ్యయము ననెడి వ్యసనముల నేడింటిని విడిచి వర్తింపవలయును.

* ఒకటిఁగొని రెంటి నిశ్చలయుక్తిఁజేసి
మూఁటి నాల్గింట గడువశ్యములుగఁజేసి
యేనిఁటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు
విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు !

రాజేంద్రా! మధురాహారముల నెప్పుడునొక్కఁడే తినరాదు. అందఱును నిద్రించినప్పు డొక్కఁడు మేల్కని యుండరాదు. ఒక్క డెప్పుడును గార్యాలోచనముఁ జేయరాదు. మార్గమున నొంటిగాఁ బోరాదు.

సత్యము తనప్రవర్తన మనెడి సముద్రము గడచుట కోడ వంటిది. అట్టి సత్యగుణమును మించినది. మఱొకటి లోకమునఁ

---

* దీనికి వేదాంతపక్షమున మఱియొకయర్థము గలదు. ఒకటియగు బుద్ధిని జేసికొని నిత్యానిత్యము లనెడు రెండింటిని నిశ్చయించి కామ క్రోధ లోభము లను మూడింటిని, శమ దమ తితిక్షోపరమము లనెడు నాల్గింటిచే వశపఱచి కొని పంచేంద్రియములను జయించి, యాహారము, దప్పి, శోకము, మోహము, జర, మృత్యువు ననెడి దేహధర్మముల నాఱింటి నెఱిఁగి పంచేంద్రియము లతోఁ గూడిన మనోబుద్ధుల నేడింటిని జయించి వర్తించువాఁడే వివేక సంపన్నుఁ డనిపించుకొనును.

గానరాదు. క్షమ గలవారిని లోకు లశక్తులనుగా భావింతురు. ఐనను క్షమ యలంకారమువంటి దనకు లేదు. అట్టి క్షమాలంకారమును ధరించువాఁడే యుత్తముఁ డనఁ దగినవాఁడు. లోకములోఁ బురుషుఁడు పరుషవచనములు పల్కకున్నచో నుత్తముఁ డనిపించుకొనును. దురితము లాచరింపనివాఁడు నుత్తముఁ డనఁదగినవాఁడే; కురురాజా!

పురుషుండు రెండు తెఱఁగుల
ధర నుత్తముఁ డనగఁ బఱఁగు దా నెయ్యెడలన్
బరుసములు పలుకకునికిన్
దురితంబులు వోరయుపనులు దొఱఁగుటవలనన్.

తనకుఁ దగినంత యధికార ముండియు సైరణ చేయువాఁడును, పేదవాఁడయ్యు నర్థికిఁ బ్రియముతో ధనమిచ్చువాఁడును బుణ్యపురుషులని చెప్పఁదగినవారు. ధర్మము తప్పకుండఁ దా నార్జించిన ధనమును నపాత్రముల కిచ్చినను బాత్రముల కీయకున్నను బురుషుఁడు రెండువిధములగు నపాయములను జెందును.

పాడితప్పకుండఁ బడయుసొమ్ములకు న
పాత్రములకు నీని పాత్రములకుఁ
బెట్టకునికి యనఁగ నెట్టన రెండ్లు వి
ధములఁ గీడు దొడరు ధరణినాథ!

వెలఁదియును, జూదంబును, వేఁటయును, పానంబును, వాక్పారుష్యంబును, దండపారుష్యమును, వృథావ్యయమును

ననెడి సప్తవ్యసనములందును నాసక్తి విడువవలయును.

> వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు
> ప్రల్లదంబును దండంబు బరుసఁదనము
> సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ము సేత
> యనెడి సప్తవ్యసనములఁ జనదు తగుల.

తన ప్రవర్తనమునకుఁ దగిన వేషము నవలంబింపవలయును. ఆత్మస్తుతివిడువవలెను. ఇతరులవలన దానుబీడింపఁబడియు నప్రియములు పలుకరాదు. పరులకేదయిన నిచ్చి దానికై విచారింపఁగూడదు. తానెంత దరిద్రుఁడైనను దారితప్పి వర్తింపఁగూడదు. ఈగుణములే మానవుని ప్రవర్తనమును బ్రకాశింపఁజేయును. చెలిమియును, సంభాషణమును, వివాదమును, వివాహమును, వ్యవహారమును దమతోఁ సమానులగు వారితోనే చేయవలెను గాని హీనులతోఁ జేయరాదు. రాజేంద్రా! కొంచెమైననుబరులకుఁ బంచియిచ్చి తక్కినది తా ననుభవించుట యుత్తమము. పరులొనర్ప మిగుల శ్రమపడుచు నల్పసుఖ మనుభవించుట హితము. అడిగినచో శత్రువునకునైన నిచ్చుట మంచిది. తన్ను లోకము పొగడుచున్నను విని సజ్జనుఁడు పొంగిపోఁడు. లోకమునకుఁ దనవలన నొకించుకయును గీడు గలుగకుండ వర్తించుచు నెప్పుడును మేలే యొనరించుచుండును.

> కొంచెమైనను దగఁబంచి కుడువ మేలు
> పనులయెడ దుఃఖమోర్చి యల్పంబు సుఖము
> ననుభవించుట హితము శత్రునకునైన
> నిచ్చుటయెలెస్స యడిగినయెడ నృపాల!

> తను లోకము గొనియాడఁగ
> విని యుబ్బఁడు సజ్జనుండు వెండియు గడుమే
> లొనరించుఁ గీడొకించుక
> యును దనదెసఁ జోపనీక యుడుగుచు వచ్చున్.

"మహీంద్రా! ధర్మనందనునొద్ద నిట్టి సద్గుణంబు లనేకములు గలవు. అతని తమ్ములును బ్రవర్తనంబున నతని ననుసరించువారలే. తండ్రిలేనిపిల్లలగు వారిని జేరఁదీసి పెంచి పెద్దచేసి రక్షించి యిప్పు డుపేక్షించితివి. వారల వెలిబుచ్చి యూరకుండుట నీకుఁ దగునా? వారిని గొనివచ్చి రాజ్యభాగమును వారి కిచ్చి నీ కొడుకులతోఁ బాటు పోషించుట యుచితము. మీరును వారును గలిసియున్న మీదిక్కు దేవతలయినను జూడఁ గలరా? నామాట విను" మని యుపదేశించిన విదురునకు ధృతరాష్ట్రుఁ డిట్లనియె. "విదురా! నీవు హితమును, గర్తవ్యము నగు కార్యము నెఱుఁగుదువు. ధర్మరాజు హృదయము నెఱుంగుదువు. కావున నాచిత్తమున నుపశాంతి గల్గునట్లు సకల కార్యజాతమును దెలుపు" మని కోరెను.

## ౮

### విదురుఁడు ధృతరాష్ట్రునకుఁ గర్తవ్య ముపదేశించుట

విజ్ఞానశాలి యగు విదురుఁడు ధృతరాష్ట్రునిగాంచి యిట్లనియె. "మహారాజా! నన్నీ విధముగా నొక్కి నొక్కి యడుగుచున్నావు. కావున నీకు దాచక యున్నమాట చెప్పెదను. సావకాశముగా వినుము. రాజ్యము చేఁజిక్కెనుగదా యని తమ్ముని

రాజ్యభాగము పంచి యియ్యకుండ నీవొక్కఁడ వనుభవింపఁ జూచుచున్నావు. అది నీకెంతమాత్ర మఱుఁగదుసుమా! ఆమిష మని భ్రాంతిచెంది గాలమును మ్రింగిన మీనముగతి యేమగునో నీకుఁ దెలియదా? ఇది యంతయును గపటాత్ముఁడగు నీకొడుకు చిత్తప్రకారము నడుచుచున్నది. నిన్ను నిందించినఁ బ్రయోజన మేమి?

"దక్కెను రాజ్యమంచు నకటా! యిటు తమ్ముని భాగమీక నీ
వెక్కటి మ్రింగఁజూచె దది యెట్లుఱుగు న్వినుమీను లోలతన్
గ్రక్కున నామిషంబుచవి గాలము మ్రింగినచాడ్పు చూడ యి
ట్లుక్కివుఁడైన నీకొడుకు నుల్లము నిన్నిటు లాడఁగూడునే?"

అని పలుక నావాక్యంబులు విని ధృతరాష్ట్రుఁడు కొంతసేపు నిశ్చేష్టితుఁడై యుండి మరల స్మృతి వహించి విదురునిఁ గాంచి "విదురా! నీ హితవచనామృతమువలన నా హృదయసంతాపము చల్లాఱినది. ఇఁక నీవు నయానయములను వివరించి తెల్పుము" అని కోరఁగా విదురుఁ డిట్లనియె. "మహీశా! పరువు రాకుండఁ గాయలుగోసి తిన్నచో రుచి చెడుటయే కాక బీజములు కూడఁ జెడిపోవును. పరిపాకావస్థఁ జెంది నపుడు కోయఁగాఁ గాయలు పండ్లగును; రుచ్యముగా నుండును. బీజములుగూడఁ జెడిపోవు. అట్లే కార్యములు యుక్తకాలమున నడవకపోయినచో ఫలసిద్ధిఁ జెందక వ్యర్థము లగును.

"కమియఁ బండకుండఁ గాయఁ గోసిన చవి
చేసె గాక విత్తు చేటుఁ గలుగు
పక్వ మగుడుఁ గోయ ఫల మిచ్చుఁ జెడదు నీ
జంబుఁ గార్యసిద్ధి చందమిట్లు.

పువ్వు లమ్మువాఁడు చెట్లనుండి పుష్పములను గోయునట్లు, తుమ్మెదలు పుష్పములనుండి తేనియను గ్రోలువిధమున వివేక వంతుఁ డెదిరికి నొవ్వకుండఁ గార్యముల నెఱవేర్చుకొన వలయును. అంతియకాని యంగారకారుఁడు బొగ్గు లకై వృక్షములను మొదలంట నఱికివైచునట్లు కార్యములను మొదలంట నశింపఁజేసికొనరాదు. పరులకు ధనమును, విద్యా విశేషమును, తేజమును, బలమును గలవని, యసూయతో వర్తించినచో నట్టి మనుష్యుఁడు రోగములేని బాధలను జెందుచుండును.

మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ దేఁటి
పువ్వుఁదేనియఁ గ్రోలెడుపోల్కి నెదురు
గందకుండఁగ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁ బోలె మొదలంటఁ బొడువ జనదు.
పరులధనమునకు విద్యా
బరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు దెవులు లేనివేదనం బడు నధిపా!

"ఎదిరివానికి హితములు మనోరంజకములు బ్రియములు నగుమాట లెన్ని చెప్పినను మంచిది. అట్టివి పలుకఁ దనకు

శక్తి చాలనపుడు మౌనమవలంబించుటయే మిక్కిలియుక్తము. మఱియు లోకములో మైత్రియు, విరోధమును, సంతోషమును, విచారమును, ధర్మంబును, పాపమును, గొప్పతనమును, నీచత్వమును దన మాటలనుబట్టియే సంభవించుచుండును. కాన నొకచో సంభాషించునప్పుడు యుక్తియుక్తముగా సంభాషింపవలెను; కానిచో నూరకుండవలయును.

"చెలిమియుఁ బగయును దెలివియుఁ
గలకయు ధర్మంబు పాపగతియును బెంపుం
దులువతనంబును వచ్చును
బలుకుబడిన కానఁ బొసఁగఁ బలుకఁగ వలయున్.

"భయంకరమగుకత్తిగాని గొడ్డఁటినిగాని చేఁబూనినఱకిన చెట్లయందు మఱల మొలకలెత్తును. కాని మాటలచేఁ బూర్తిగాఁ జెడిపోయిన కార్యము మఱి చక్కఁబడనేఱదు. శరీరమున గ్రుచ్చుకొన్న యమ్ములను మెలపుతో నూడఁదీయవచ్చును. అంతియకాని మిక్కిలి పరుషములై హృదయమున నాటిన మాటల నెన్ని యుపాయములనైనను వెలిపుచ్చనేరము రాజేంద్రా!

"తనువున విఱిగినయలుఁగుల
ననువునఁ బుచ్చంగ వచ్చు నతినిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
విను మెన్నియుపాయములను వెడలునె యధిపా!

"నీవును బాగుగ నాలోచింపుము. ధర్మనందనునినోట నొకనాఁడయినను బరుషవాక్యము వింటివిమా? ఇట్లుండ

నీకుమారు లొకరినొక రతిక్రమించి యీ ధర్మరాజాదుల ననేక
పరుషవచనములాడి నొప్పించిరి. వానిని నీవు వినియు వారింపక
యూరకుంటివి. ఇది నీకుఁ దగునా? మాటలచే విఱిగిన మనస్సు
నదుకుటకు మందెక్కడనైనను గలదా? ఇది నీకుఁ దెలియనిదా?
చేటుకాలము సమీపించునప్పుడు గాని యిట్టి చెడ్డమాట
లాడుదురా? అన్యాయ ప్రవర్తకు లగువారి కధర్మములు
ధర్మములుగాఁ బొడకట్టును. కావున నధర్మమార్గానుసారులగు
నీకొడుకుల ప్రవర్తనము విపరీత మగుచున్నది. పుత్త్రమోహా
భ్రాంతమైన నీ బుద్ధియు నీ తనయులు పట్టినమార్గమును బట్టి
పాండవులతోడి విరోధంబున కొడంబడియెను. నేనెంతబోధించు
చున్నను నది మరలదయ్యెను. నీవంటివాఁ డట్లు వర్తించుట
విచారకరము, మహాపాపము! మనవంశంబునఁ దేజోధైర్యాది
గుణగరిష్ఠుండై సుప్రసిద్ధిగాంచిన యుధిష్ఠిరుఁడు రాజ్యభ్రష్టుఁడై
యట్లుండుట న్యాయమా! ఉత్తమశీలుఁడగు నతఁడు నీపెద్దఱి
కంబుజూచి మాఱాడలేక శాంతించియున్నవాఁడు. అంతియకాక
యతఁడు విజృంభించినచో నీవును నీకొడుకులు నేమగుదురో
యెవ్వరు చెప్పఁగలరు" అని బోధింప ధృతరాష్ట్రుఁడు విని
సంతసించి "ఓయీ! నీ నీతివాక్యములవలన నామనస్సు
తృప్తిచెందకున్నది. ఇంకను నుపదేశింపు" మని కోరెను.
అప్పుడు విదురుఁడు మఱల నతని కిట్లనియెను:—

"మహారాజా! సకలపుణ్యకర్మసమూహము నొకవంకను,
ధర్మప్రవర్తన మొకవైపునను నుంచి తారతమ్యనిర్ణయము

చేయునప్పుడు వేదములు ధర్మప్రవర్తనమునకే పెద్దరిక మిచ్చినవి. జనులు ధర్మమార్గమున వర్తింతురేని యిహలోక ఫలములనెల్లఁ జెందుటయకాక శాశ్వతమగు కీర్తినిగూడఁ గాంచఁ గల్గుదురు. ఆ కీర్తి భూతలమున నెంతకాలముండునంత కాలమును బుణ్యలోకంబును బొందియుందురని బుధు లందురు.

పొడిగలిగిన నిహలోకఫలము లెల్లఁ
జేరుటయ కాదు కీర్తియుఁ జెందు పురుషు
ధరణిఁబఱఁగు బొగడ్త యెందాక నంత
కాలమును బుణ్యలోకంబు గల్గునండ్రు !

సుధన్వవిరోచనుల వృత్తాంత మిదివఱలో నీకు విన్నవించితిని. దైత్యకులసంభవుఁ డయ్యుఁ బ్రహ్లాదుఁడు ధర్మంబు పలికి సుధన్వునకు జయమిచ్చి యతనివలనఁ బుత్త్రుని రక్షించి కొనియెను. దానివలనఁ బ్రహ్లాదున కిహలోకమునఁ బుత్త్రి ప్రాణలాభమేకాక యిప్పటికిని నతఁడు ధర్మాత్ముఁ డను కీర్తి నిలిచియున్నది. అట్లే నీవును బుత్త్రులయెడఁ బక్షపాతమువిడిచి ధర్మంబు పాటింపుము. పాండవుల నాదరించి కౌరవ పాండవుల నుభయుల నొక్కవిధమునఁ జూడుము. అట్లయిన వారును వీరును నొక్కటియై యాపదలఁ బొరయకుండ బ్రదుకుదురు. అందువలన నీశోకము శాంతించును. నీవు సుఖింతువు. రాజా! మనప్రవర్తనమునకు మనమనస్సే మూలము. మనోవృత్తినిబట్టి మన వర్తనము మారుచుండును. మనము పాపకార్యముల కలవాటుపడి వానినే యొనరింతుమేని యవియే మనకింపగు

చుండును. కాక ధర్మకార్యముల కలవాటు పడుదుమేని వాని నాచరించుటకే యిష్టపడుచుందుము. ఇది మానవస్వభావము. కావున నీవు నీకొడుకులను జిన్ననాటినుండియు మంచిమార్గమునఁ బ్రవేశింపఁజేయవలసినది. వారికి ధర్మమార్గ మలవాటుచేయక పోవుట నీదే లోపము. మఱియు దేనియందార్యులు సంతోషముతో నిల్వరో యది సభ యనిపించుకొనదు. ఎవ్వరు మంచిధర్మమును బల్కరో వా రార్యులుకానేకారు. ఏది సత్యమార్గావలంబి కాదో యది ధర్మమేకాదు. ఏది నెపముతోఁ గూడినదో యది సత్యమేకాదు.

> అది సభయే ప్రియం బెసఁగ నార్యులు నిల్వరయేని యార్యులే
> మదిఁ దలఁపంగ వారలు సమంచితధర్మము పల్కరేని న
> ట్టిదియును ధర్మ మేతిగ ఘటించిన నిక్కము లేనిదేనిఁ దా
> బదిలపునిక్కమే యొక నెపం బిడుచొప్పగునేని భూవరా!

రాజేంద్రా! నెపముతోఁగూడినది సత్యముకాదు. సత్యము కానిది ధర్మముకాదు. ధర్మము పల్కనివా రార్యులుగారు. ఆర్యులులేనిది సభ యనిపించుకొనదు. ఇట్లుండ సధర్మపరు లగు కర్ణాదు లున్నది యేమనిపించుకొనునో యోజింపుము. నీతిమార్గమున బ్రదుకుట యుత్తమపద్ధతి. శౌర్యమువలన సంపదలు పడసి జీవించుట మధ్యమము. కపటసాధ్యములగు సంపదలతో జీవించుట యధమము. మీరు పాండవులసంపద లను మాయచే నొడిచికొన్నవారు. మీది యధమజీవనము. నీతిబాహ్యమైనది. నీతిబాహ్యులగువారి నుత్తములు మెచ్చరు.

నీతిపథంబునన్ బ్రదుకనేర్చుట యుత్తమభంగి శౌర్యసం
జాతములై కరం బలరు. సంపద లొందుట మధ్యవృత్తి య
స్ఫీతములైన భారవహజీవనముల్ దలపంగ నిష్టముల్
నీతికి బాహ్యులైన ధరణీవర మెత్తురె వారి నుత్తముల్.

"మహీంద్రా! నీతనయులెల్లప్పుడును గయ్యామునకే కాలు ద్రవ్వుచుందురు. వారిమంత్రులయిన కర్ణుడు మొదలగువారు వారికంటెను శూరులు. నీవయినను వారినే యనుసరింతువు గాని నీతిమార్గము ననుసరింపవు. పాండవులు మీవలె మధ్యమమగు శౌర్యజీవనము నంగీకరింపరు. వారెప్పుడును నీతిమార్గగాములై మెప్పు జెందుచుందురు. శత్రువు లెదిరించి నప్పుడు భగ్నుల మందుదురు. వారి నెవ్వరును శాంతింపఁ జేయలేరు. మఱియు,

"కయ్యమునకు నెపుడు గాలుద్రవ్వుదురు నీ
పుత్త్రులెల్ల నూతపుత్త్రుఁ డాది
యగు తదీయమంత్రు లంతకుముందర
విరుదు లీవు నీతి తెరువు చూరవు.

"పాండవులు శౌర్యమొల్ల ర
ఖండితనీతిప్రకార కార్యము మెచ్చె
యుండుదు రెదురేచినఁ దుది
మందుదు రార్పంగ రాదు మఱి యెవ్వఱికిన్."

"పాండవులు నిన్నుఁ దమ కన్నతండ్రినిగా భావించి భక్తియుక్తులై వర్తించుచున్నారు. వారి ప్రవర్తనములు సాధుజన గేయము లగుటకు సందియములేదు. అట్టివారిని నీవు కన్న

పుత్త్రిలవలెఁ జూచి యాదరించుట యుక్తముకాదా ? నీవట్లు చేరఁదీసి రక్షింపకపోయిన వారికి లోపముండదు. లోకములో నకారణవాత్సల్యహృదయులు పెక్కురు గలరు. వారలు పరోపకారపరాయణులయి పరుల కార్యములు నెఱవేర్ప నెంతో శ్రమపడుదురు. అట్టిమహాత్ములే పాండవులకు రక్షకులగుదురు. "ధృతరాష్ట్రుఁడు తమ్ముని కుమారుల కన్యాయముచేసె" నన్న యపకీర్తి నిన్నుఁ బొందును గదాయని విచారించుచున్నాను ; గాని పాండవులకు రక్షకులు లేరని కాదు. రాజా! ఒకరివలన రక్షణ గాంచి యతనిసాయముననే పలువిధము లగు సంపదలను బొంది, తన కట్టి సహాయుఁ డయిన పురుషునకుఁ దుద కపకారము గావించు కృతఘ్నుని పీనుఁగును రోఁతచేఁ గుక్కలయినను గబళింప వని పెద్దలందరు. పాండురాజు నీకుఁ బరమభక్తుఁడు. మహాపరాక్రమశాలి యగు నతని వలన నీవు సురక్షితుఁడవయి యతని సాయమున శత్రువిజయమును గాంచుటయే కాక రాజ్యాభివృద్ధిని గూడఁ గాంచి తుదకాతని సంతతికిఁ గీడుచేయ రోయకున్నావు. నీవంటి కృతఘ్నుఁడు లోకమందు వేఱొకఁ డుండునా ? ఆ పాండురాజు నీ కొనర్చిన యుపకారమును బరగణింపవేమి ? అట్లొనర్పకుండుట కెంతమాత్రమును దగవు కావున, బాండురాజువలెనే నీయెడఁ బరమభక్తులై వర్తించు పాండవులను రప్పించి యాదరింపుము. అదియే నీకెల్లవిధముల శ్రేయస్కరము. ఇట్టి స్వల్పకార్యమును నెఱవేర్చి సుఖించుటకు బదులుగా దుఃఖింతువేల ? బ్రదుకును,

ప్రాణహానియును, బాగద్దయును, నిందయును, దాసంబును, యాచనమును మొదలగు సుఖదుఃఖములు లోకములోనివారి కందఱకును మాటిమాటికి వచ్చుచుండును. లోకసామాన్యమై వచ్చువానికిఁ జింతింప నేందులకు? దుఃఖమువలన దేహబలము తఱుగును. రూపుచెడి పోవును. మతి తప్పిపోవును. రోగములు గూడ సంప్రాప్తములగును. ఆ దుఃఖమువలనఁ గృశించిపోయి నచో శత్రువులు నవ్వుదురు. కావున సర్వనాశకమగు నీదుఃఖ మును విడువుము.

వగ బలము దఱుగు రూపఱు
వగచిన మది దప్పుఁ దెవుల్ వచ్చును దూఱుల్
పగచి నలంగినఁ బ్రియమగు
బగతురకును వగచు టుడుగు పార్థివముఖ్యా!

ఆయుపదేశమును విని ధృతరాష్ట్రుఁడు విదురునితో "ఓయీ! నీ వన్నది సత్యము. నేను దుర్వృత్తుఁడనై పాండవులను దుఃఖింపఁ జేసితిని. ఇట్టి దురాత్ములకు యుద్ధమున మరణము తప్పునా? మఱియు వగలు మిగులక యుండునా? కావున నా కీ దుఃఖములు నశించు మార్గము నుపదేశింపు" మని వేడిన విదురుఁ డిట్లనియెను:—

"రాజేంద్రా! తపస్సును, నింద్రియనిగ్రహంబును, విద్యయును లోభత్యాగంబును శాంతికారణములు. ఆ శాంతికారణము లన్నింటిలోను లోభత్యాగమే ముఖ్యమైనది. మఱియు గోవుల నాక్రమింపరాదు. బ్రాహ్మణులతోఁ జనవు చేయ

రాదు. స్త్రీలను బాధింపరాదు. జ్ఞాతులతోఁ గలహింప
రాదు. ఇట్లైనఁడు వర్తించునో వానిసంపద లవలీల నభివృద్ధిఁ
జెందును. జ్ఞాతు లొకరి కొకరు సహాయులై పరస్పరమును
రక్షించుకొనుచు సంతోషాతిశయమును బొంది తామర
కొలఁకువలె లక్ష్మికిఁ జోటైవర్తింతురు రాజా! ప్రత్యేకముగా
నున్న చెట్టును గరితురగాదులును ధ్వంసము గావించును.
గాలియును జెఱుచును. అట్లుగాక చెట్లన్నియు గుంపయి
యున్నచో వానికెట్టి యాపదయుఁ గలుగనేరదు. అట్లే
జ్ఞాతులు పరస్పరస్నేహముతో వర్తిల్లినచో నెవ్వరివలన
నపాయము పొరయకుండును. లేనిచో శత్రువులకులొంగిపోయి
సులభముగా నశించిపోవుదురు. కావునఁ గౌరవులును
పాండవులును నొండొరులకు బ్రాపై పోరు మానినచో
శత్రువులకు నజేయులయి నిస్సపత్నకంబగు రాజ్యంబు వడసి
సుఖింతురు. వనవాసంబునఁ గుందుచున్న పాండవులను
దడయక రప్పించి వారికర్హమగు పదంబిచ్చి యాదరించుట
నీవు నీకొడుకు నాదరించుటయె కాదా? మఱియు లోకమునఁ
బ్రియవాదు లుందురు. కాని యప్రియంబైన పథ్యవచనంబుల
నాడువారరుదు. నేను ద్యూతసమయమందే యుద్ధండి నీకది
యప్పటి కప్రియంబుగా నున్నను శంకింపక పథ్యవచనం
బుపదేశించితిని. కాని రోగికిఁ బథ్యాహారంబువలె నీ కవి
రుచింపక పోయెను. నీకుఁ గోపమువచ్చినను సరియె. మఱియొక
మాట నొక్కి వక్కాణించుచున్నాను. కాకంబులఁ గైకొని

మయూరంబుల విడుచునట్లు, మార్జాలంబులం జేకొని సింహంబులను దిరస్కరించు విధంబున నీవు దుర్యోధనాదులను జేపట్టి పాండవులను ద్రోసిపుచ్చుట తగదు. నేఁడు కార్యంబు ముట్ట వచ్చినప్పుడు భూతము సోఁకినట్లు తల్లడిల్లుచున్నావు. కుల రక్షణార్థ మొకనిఁ ద్రోసిపుచ్చుట నీతియని పండితులందురు. దుర్నయపరుండగు దుర్యోధనుని విడిచిపుచ్చిన నష్టములేదు. సంపదలు సహాయసాధనముల నపేక్షించును. సహాయసాధనములు సంపదల నపేక్షించును. ఇట్లే రెంటికిని బరస్పరాశ్రయణము నియతంబు. కావున నీ సంపదలు పాండవులకును బాండవసహాయత నీకును బ్రియం బొనరించును. ఇట్లుచేయుట మీ కుభయులకును శ్రేయస్కరంబు. కురువంశనిస్తారకు లగు భీష్మ యుధిష్ఠిరులును, నవక్రవిక్రములగు కర్ణార్జునులును, బ్రతాపధాము లగు భీమ దుర్యోధనులును, శస్త్రాస్త్రపారగు లగు నభిమన్యులక్ష్మణప్రభృతికుమారవర్గంబు, శాపానుగ్రహ సమర్థులగు ద్రోణద్రుపదాది పరమాప్తులును, నొక్కటియై నీ యనుమతిని వర్తింప లయవిక్రమములం దింతేని లోపము లేకుండ నీ రాజ్యమును నీవు పాలించిన నెంత బాగుండునో చెప్పవలయునా? పాండవు లొకవేళ ధీరమతులై మీతో వైరము పాటింపక తొలగియున్నను, నీకుమారుఁడు చీకాకు పడకుండ ధరాపాలనాభారము వహింప నేర్చునే? కావునఁ బాండవుల రక్షింపుము."

ధృతరాష్ట్రుఁ డతని యుపదేశము వినియుఁ బుత్త్రుఁడగు దుర్యోధనుని విడిచి యుండలేనని వలుక విదురుఁ డతని

కిట్లనియె. "ఓరాజా! జ్ఞాతులు గుణహీను లయినను విడువ రాదని పెద్దలు చెప్పుచుండ సకల సద్గుణసంపన్ను లగు పాండవులను విడుచుట ధర్మమగునా! నేను నీకు హితంబు గోరువాఁడ నని యోజించి నావచనములు మన్నించి పాండవులకు జీవనార్థము చిన్న పల్లెలైనను గొన్నియిచ్చి దుర్యోధనుని నొడంబడఁజేసి యిరుపక్షములవారిని రక్షించుట యుక్తము. ఇప్పుడు నీ వుపేక్షించితివేని కౌరవపాండవులకు సమరము కాక తప్పదు. అప్పుడుమీరు పశ్చాత్తాప మందవలసివచ్చును. దానికప్పుడు ప్రతీకారంబు గాన నేరము. కావున నిప్పుడే మేల్కని పాండవులతో సంధి చేసుకొనుట యుచితము. రాజ్యముకై తమలోఁ దాము పోరాడి చావవలయునా? అట్లయినఁగాని చావు రాదా? శరీరము లాధి వ్యాధి జరా సమన్వితము లగుటంజేసి జాతిమాత్రుని కెల్ల మరణము సహజము. గజతురంగాదిసంపదలుగల్గి సుందరీజనములతోఁగలిసి విహరించుచుఁ, బ్రజ లనురక్తు లగునట్లు భూపరిపాలన మొనర్చుచు, యుద్ధములందు విజయలక్ష్మిని జేకొనుచు, నాభరణానులేపనాదివైభవంబున నాసిగాంచిన మహీపతు లందఱును మరణించిరి గాదా! మరణము గోరి తెచ్చికోవలెనా?

గజతురగాదిసంపదలు గాంతలతోడి విహారలీలలున్
బ్రజ లనురాగమొందఁ బరిపాలన చేయుక్రమంబు పోరులన్
విజయముఁ బొంది పేర్చుటయు విస్ఫురితాభరణానులేప వ
స్త్ర జనితవైభవంబు గలరాజులుఁ బోయిరి కాక నిల్చిరే.

కావున జెఱికిఁజేదైనను నావచనములను వింటివేని యిహాపర సౌఖ్యములను గాంచి కీర్తిమంతుఁడ వగుట నిక్కము. నీలో నీ వాలోచించుకొని ధర్మతనయుని వినుపక్ష నీతోడుకులను, నీమంత్రులను సమ్మతిపఱచి సంధిగావింపుము ”

అంబికేయుఁ డది విని “ విదురా ! నీపలుకులవలన బుద్ధి కలఁక తేఱె ధర్మంబును యశంబును లాభంబును గల్గులాగున నీవు చెప్పినదియే కర్తవ్యమని పలికిన దనయత్నంబు సఫలం బగుటకు విదురుఁ డానందించెను. అమ్మహానుభావుఁడు విదురుఁడు, జ్ఞాతికలహమువలనఁ గురుకుల మంతరించి పోవు నేమో యన్న భయమున నిట్లనేకవిధముల నీతిని హితమును బోధించెను. అపమార్గమున వర్తించు ధృతరాష్ట్రుని సన్మార్గ వర్తిగాఁ జేయుటయే కాక యితరులచేఁగూడ చెప్పించి యట్లొనర్పనెంచెను. మఱియు ధృతరాష్ట్రుఁడు తన కధ్యాత్మ తత్త్వ ముపదేశింప వలయునని కోరగా “ రాజా ! నీ కాయర్థ మునుబోధింప సనత్సుజాతుఁడు వలంతి. అతనిచే నీకుపదేశంబు చేయించెద ” నని పలికి స్మరణమాత్రంబున సమ్మహాయోగిని రప్పించి యతనిచే నధ్యాత్మ తత్త్వం బుపదేశింపఁ జేసెను. విదురుఁడు శూద్రకులుఁడయ్యును సనత్సుజాతాది యోగి పుంగవుల యాదరంబునకుఁ బాత్రుఁడని తెలియవచ్చుటచే నతనిమహాత్మ్యము వెల్లడియగుచున్నది.

౬

సజ్జనులు ధర్మపక్షపాతులు; పరదుఃఖాసహిష్ణువులు. అధర్మమువలన ధర్మమునకు హాని సంభవించుచున్నపుడు వారది సహింపలేరు. ధర్మపక్షము నవలంబించి శక్తికొలది పాటు పడుదురు. వారలు సాత్వికులు కానున్నప్పుడు ముందుగానే దుఃఖకారణములను దెల్పి వారిని మార్గమునుండి తొలఁగింపఁ బ్రయత్నించి "ఊరక యుత్తముఁడు తనవారి కపాయము వచ్చువేళ మిన్నకున్నారని చెప్పు తీర్పు" నను నర్థమును సార్థకము గావించి తమ యుత్తమత్వమును వెల్లడింతురు. విదురుఁ డిట్టి సాధుహృదయుఁడు. పాండవులది ధర్మపక్ష మనియుఁ గౌరవుల దధర్మపక్ష మనియు నతఁ డెఱుఁగును. అధర్మపరులగు కౌరవులవలన ధర్మపరులగు పాండవుల కిక్కట్టులు సంభవించుచుండ విదురుఁడు ధర్మపక్షమున కూర్తుఁడై యధర్మమును వారింప బద్ధకంకణుఁడై ధృతరాష్ట్రుని కనేక విధముల బోధించెను. ధర్మపక్షమును స్థాపింపవలె ననియే యతని పట్టుదల. అతఁడు ధర్మపక్షపాతముచేతనే ధృతరాష్ట్రున కంతగా హితోపదేశము చేసెను గాని పాండవ పక్షపాతముచేఁ గాదు.

ధృతరాష్ట్రుఁడు సంజయునివలన ధర్మరాజు నిశ్చయ మెఱింగి విదురునిఁ జూచి "సూతకుమారుఁడు కర్ణసహితముగా మృత్యుపాశబద్ధుఁడుగాఁ దలఁచినాఁడు. ఇఁక మనము చేయ వలసినపని యేమి?" యని యడిగెను. అప్పుడు విదురుఁడు

“ రాజా ! కురుకులపితామహుండు హితంబుగఁజెపఁ గర్ణుండు రోషితుఁడై భీష్ముఁడు రణరంగమున వర్తించునంతకాలంబును దా నాయుధమును ముట్టనని ప్రతిజ్ఞచేసి సభను విడచి పోయెను. ఇట్టివాఁడు ముందు యుద్ధరంగమున మాత్రము స్థిరముగా నుండునని యేమి చెప్పఁగలము ? నీ కొడుకట్టి వానిని నమ్ముకొని బలవంతులతోఁ బోరుసల్ప డీకొనుచు నున్నాఁడు. మనవారలు మొదటనే దుర్బలులు. ఆపై నంతఃకలహములు పెంచుకొని విగసవచనములచే విమనస్కులగుచుండిరి. ఇది యంతయు శత్రువులకుఁ గార్యసాధనమునుమా ! పాండవులంద ఱొక్కటిగా మెలఁగుచున్నారు. అట్టివారిని రణమున నోడించు టసాధ్యము. కావున దుర్యోధనాదుల వెడమాటలు పెడచెవినిడి పాండవులతో సంధిగావించుకొనుట తప్ప మన కుపాయాంతరములే ” దని బోధించెను.

ధృతరాష్ట్రుఁ డిట్లెన్నిపర్యాయములు కార్యాలోచన మడిగినను విదురుఁడు చెప్పిన దొక్కటియే సమాధానము. ఏ యంశమైనను మఱి మఱి చెప్పినచో నెదుటివారి చెవికెక్కుట సహజము. అట్లనియే విదురుఁడు తన హితవచనబీజములను ధృతరాష్ట్రుని హృదయక్షేత్రమున మాటిమాటికిని నాటెను. కాని ప్రయోజనము లేకపోయెను. రాజు హృదయము దుర్బలమగు నూసరక్షేత్రమువంటిదని విదురుఁడు గ్రహింపఁ లేకపోయెను.

శ్రీకృష్ణ రాయబారము

జగదీశ్వరుండు, యాదవకులాలంకారభూతుఁడు నగు శ్రీకృష్ణుండు

పాండవకార్యార్థియై సేవకుఁడగు సాత్యకియు యుక్తపరివారంబును గొలువ రథారూఢుఁడై హస్తిపురంబున కరుదెంచెను. లోకనాయకుఁడగు శ్రీకృష్ణుఁడు వచ్చుచున్నాఁడని విని ధృతరాష్ట్రుఁడధికానందభరితుఁడై తగినయుపాయనములచేతను, సత్కారములచేతను, భక్తివిశేషములచేతను బాండవపక్షపాతియగు కృష్ణుని లోఁగొనఁదలంచెను. ఆ మహారాజు వెంటనే శిల్పులను పిలిపించి పురమంతయుఁ జక్కఁగా నలంకరింపించెను. ఉదయకాలమందలి కమలాకరమువలె నాపురమెటుచూచినను బరిపూర్ణశోభ వహించి కలకలలాడుచుండెను. అందుఁ గృష్ణునకు విడిదిగా నేర్పఱచిన మందిరము సర్వాలంకారశోభితము సర్వోత్తమమై నేత్రపర్వము లొసఁగుచుచుండెను. మఱియుఁ గృష్ణునకు విందొనర్ప నెంచి నానావిధ రుచ్యపదార్థములను సేకరించి యుంచెను. ఇట్లు ధృతరాష్ట్రుఁడు సర్వవస్తుసంభారమును సంపాదించి సముత్సాహభరితుఁడయి విదురునిఁ జూచి "సోదరా! మనయదృష్టమేమన వచ్చును? శ్రీకృష్ణుఁడు మనకడకు దూతగా వచ్చుచున్నాఁడు. అతని హృదయమానందించునట్లు మనము ప్రవర్తింపవలెను. అట్లొనర్పఁ గలిగితిమేని సర్వకార్యములను సమకూర్చుకొనిన వారమగుదుము. కావున నమ్మహాత్మునకు నేనమూల్యపదార్థములను గానుకగా నీఁదలంచితిని. ఇంతయేల? మనయింటను, దుర్యోధనుని దివ్యమందిరంబునందును, దుశ్శాసనుని సౌధంబునందును నతని కంటికిఁ బ్రియమగున దెట్టి యమూల్యమైన

దైనను నెంతటి మనోహరమైన దైనను దప్పక యిచ్చితీరె
దను. అపురుషోత్తముని సంతసింపఁజేయుటకంటె మనకుఁ గావ
లసిన దేమి?" యని పలుకఁ విదురుఁడు విని యతని యభిప్రాయ
మును గ్రహించి యిట్లనియె. "ఓ రాజేంద్రా! శ్రీకృష్ణభగ
వానుని సంతసింపఁజేయుట కంటె మనకు హితకార్యమేమి
కలదు? అమ్మహామహునిఁ బూజించుటకంటె మనకు విహిత
కృత్యమేది కలదు? యోగీశ్వరులకును, మునీంద్రులకును,
బ్రహ్మేంద్రాదులకును నభిగమ్యుఁడగు పురుషోత్తముఁడు
కార్యార్థియై మనయింటి కేతెంచుటఁ జూడ మనము నిజ
ముగా మహాభాగ్యవంతులమే. కాని యట్టి గౌరవార్హుఁడు
తనకుఁ దాని కొల్లుద్రోసుకొని వచ్చినప్పు డతనిని జక్కఁగా
నాదరింప లేక పోయితిమేని కరతలగతమగు వైకుంఠమును
ద్రోసినవార మగుదుము. కావున నీవు నిశ్చల భక్తిపూర్ణ
హృదయముతో నతని నర్చించి సంతసింపఁ జేయవలయును.
నీ వట్లొనర్తువేని కడు శ్లాఘనీయము. కాని నీ యభిప్రాయము
వేఱువిధముగా నున్నట్లున్నది. శ్రీకృష్ణునకు లంచమిచ్చి సంప్రీ
తుని గావించి మనపక్షమునకుఁ ద్రిప్పఁ జూచుచున్నట్లున్నది.
కావుననే మనమందిరములందుఁ గల సకలోత్కృష్ట పదార్థము
లను నాతని కిచ్చెదనని పల్కితివి. అర్ధరాజ్యమున కర్హులగు
పాండవుల కయిదూళ్ళయినను నీయఁజాలని లోభివగు నీ వా
యైదూళ్ళకంటెను నెక్కుడు విలువఁ గల పదార్థముల నాతని
కెట్లియ్య సాహసించితివో తెలియఁ జాలకున్నాను; ఆహా!

నీవెంత వెడఁగ వగుచున్నావు? శ్రీకృష్ణుఁడు భక్తిచే సంత
సించునట్టి పదార్థములచే సంతసించును. మానవుఁడు భక్తి
హీనుఁడై మీఁదు సమృద్ధిగా నిచ్చినను నతఁడు దానిని
తృణప్రాయముగా గణించును. భక్తిపూర్వకముగా నొక
పువ్వు నొసఁగినను నతఁ డత్యాదరంబునఁ గైకొనును.
ఈ యథార్థమును నీవు తప్పక గమనింపుము. అచ్యుతుని
భక్తిచే నారాధింపుము. అర్జునుఁ డాతనికిఁ బరమ
భక్తుఁడు. కావుననే యాతఁ డర్జునపక్షపాతియై వర్తించు
చున్నాఁడు. నీవు శ్రీకృష్ణుని నీపక్షమునకుఁ ద్రిప్పఁదలంచితి
వేని యర్జునునికంటె నధికభక్తుఁడవు కావలయును. నీ వసదృశ
మగు భక్తి చూపుదేని కృష్ణుఁడు నీపక్ష మవలంబించును.
కాని మనస్సు భక్తిమార్గమున కలవాటుపడి యుండలేదు.
మన మెట్లు కృష్ణుని వశ్యము గావించుకొనఁగలము? మన మెట్టి
కానుకలిచ్చినను నేకాంతభక్తుఁడగు నర్జునుని విడిచి కృష్ణుఁడు
మనపక్షమునకు వచ్చునా? అట్లెప్పటికిని గాదు. అర్జునుని
భక్తియు నచ్యుతునౌదార్యంబును నీ వెఱుంగనిది కాదు.

"నీతలఁ పేమగంటి నొక నేర్పున కోరికి లంచ మిచ్చి సం
ప్రీతునిఁ జేసి కార్యగతి భేదము సేయఁగ జూచె దింత చే
తైతిగదే సుమేరుసదృశార్థము సూచియుఁ బార్థుఁ బాయునే
యాతఁడు క్రీడిభక్తియును నచ్యుతు పెంపును నీ వెఱుంగవే."

ఆ నారాయణుఁడు కోరినదానిని మీరు మృదువుగ నెఱ
వేర్చఁగేని యదియే యతనికి వేయి పదార్థము లొసంగుట.

అంతకుఁ దప్ప నతనికి సంతృప్తికరము గు వస్తువు లేదు. ఇంక నీ మరుద్దేశమును విడిచి భక్తిపురస్సరముగా వర్ణింపుము.

ఇట్లు రాజ్యలోభముచే ధృతరాష్ట్రుఁడు పలు పోకలఁ బోవుచుండ విదురుఁ డది తన బుద్ధిచాతుర్యముచేఁ దెలిసికొని హితోపదేశముచేసి యతనిని యుక్తమార్గమునకుఁ ద్రిప్పు చుండెడి వాఁడు.

విదురుఁడు ధర్మజ్ఞుఁడును నీతిజ్ఞుఁడు ను లోకవేదియు నగుటయే కాక వైష్ణవభక్తాగ్రేసరుఁడని కూడ చెప్పవలసి యున్నది. ఈ యంశమును నిశ్చయింప నిచ్చటఁ గొంచెము వ్రాసెదను.

ధృతరాష్ట్రుఁడు రాజాధిరాజు, చంద్రవంశాలంకార భూతుఁ డగుటచే నుత్తమక్షత్రియుఁ డనుటకు సందియములేదు. అతఁడు కృష్ణునకు గొప్పవిందు చేయఁదలంచి బహుపదార్థముల సేకరించి సూపవిద్యానిపుణులచే వండింపించి యాయత్తము చేసియుండెను. బంధుకోటిలోనివాఁడగు కృష్ణుఁడు తన్నుఁ గాదని వేఱొకరియింట భుజింపఁడన్న నమ్మకము ధృతరాష్ట్రునికిఁ గలదు. కాని కృష్ణుం డట్లుచేయక తన భక్తాగ్రేసరుఁ డగు విదురునింట విందుగుడువ నిశ్చయించెను. తమయింట మాని దాసీపుత్త్రుఁడగు విదురునియింట భుజించుట తగదనియుఁ, గుడిచి కూర్చుండినపిమ్మట రాయబారపుఁగార్యము దెలుపుట యుక్తముగాని కార్యనిర్వహణానంతరముననే భుజించెద ననుట యనాలోచిత మనియు దుర్యోధనాదులు పలికిరి. కాని నారాయణుం డామాటలను లక్ష్యము సేయలేదు. అతఁడు

దుర్యోధనునిఁజూచి "బావా! నీ పలుకు లసంగతములు. కార్యప్రధాను లగువారికి భోజనముతోఁ బనిలేదు. నాకుఁ గార్యము ప్రధానము. కాని భోజనముకాదు. ఇంతకును నీయింట భుజించుట నాకుఁ దగదు. నీవు నాకుఁ బరమశత్రువవు. శత్రునియింటఁ గుడువరాదని నీతిజ్ఞులు చెప్పుదురు. నేను నీకు శత్రువు నెట్లయితినని యందువేని వినుము: పాండవులు నాకుఁ బంచప్రాణంబులు. ప్రాణంబులకు ద్రోహము దలంచినవారు శత్రువులుకాక మఱెవ్వరు? చిన్నప్పటినుండియు నీవు పంతము పట్టి పాండవులను జంప సకలోపాయంబులఁ బన్నితివి. అట్టి నీవు నాకు శత్రువవు గాక యాప్తుఁడ వెట్లగుదువు? కావున మీ యన్నంబు లన్నియు దుష్టంబులు. విదురుని యన్నంబు మాత్రమే భోక్తవ్యమని ప్రశంసించి తనంతఁ దానే విదురుని యింట విందారగింప నరిగెను. శ్రీకృష్ణుని వాత్సల్యమునకు విదురుఁ డెట్టి ముఖ్యస్థాన మయ్యెనో చూడుఁడు. మఱియు దేవదేవుఁడగు శ్రీకృష్ణుఁడు తనయింట విందారగింప వచ్చెనని తెలిసికొనినప్పుడు విదురునకు గల్గిన యానందమునకు మేరలేదు. అతఁడు పరమభక్తితోఁ గృష్ణునకుఁ బూజనల్పి యప్పటి కప్పుడు సిద్ధము చేయించిన హృద్యపదార్థములచే నతనికి విందిడి, సంతృప్తి గావించి, యోగిజనహృదయగమ్యుఁడగు నద్దేవున కిట్లు ప్రత్యక్షముగా నాతిథ్య మిచ్చు భాగ్యము లభించుటచేఁ దన్నుఁ గృతకృత్యునిగా భావించుచు భయభక్తి వినయంబులు ముప్పిరిగొనఁ జేతులు ముకుళించి "ఓగోవిందా! నీవు

నాయందుఁ జూపిన వాత్సల్య మింతయని చెప్ప వీలులేదు. బ్రహ్మేంద్రాదులచేఁ గీర్తనీయుఁడ వగు నీవు హీనజనుఁడ నగు నాయింటి కతిథి నయితివి. ఇదియే నాకుఁ బరమధనము. ఇదియే నాకుఁ బురుషార్థము. ఇదియే నా భాగ్యాతిశయమును వెల్లడించుచున్నది. ఇఁక నాకుఁ గావలసిన దేమి? నేను ధన్యుఁడ నయితిని. నాజన్మము ధన్యమైనది. నాగృహము ధన్యమైనది. నాయంతటి భాగ్యవంతుఁ డీలోకంబున నెచ్చటను లేఁడని పలుకుచు భక్తిభావంబున నర్ధనిమీలితము లగు నేత్రములనుండి యానందబాష్పములఁ గురియించుచు సకలోపచారంబులు గావించెను. ఇందువలన విదురుఁడు భక్తాగ్రేసరుం డని చెప్పుట కెట్టి సందియమైనను గలదా?

శ్రీకృష్ణునకు విదురునియందు వాత్సల్యమే కాక యధిక గౌరవముఁగూడఁ గలదు. అతఁడు విదురునిఁ గార్యాలోచన మడుగుటయే కాక దుర్యోధనుని సభామందిరంబు చొచ్చునెడ భీష్మాదులును, దుర్యోధనాదులును నటుండ వారినిఁగాదని విదురునిహస్త మొకచేతితోను, తన సోదరుఁడగు సాత్యకిహస్త మింకొకదానితోను నవలంబించి నడిచి విదురుఁడు తన గౌరవమున కత్యంతపాత్రుఁ డన్న యంశమును సభామధ్యమున వెల్లడించెను. మఱియు ధృతరాష్ట్రుని సన్నిధానమునఁ గృష్ణుఁడు రాయబారపువృత్తాంతము విన్నవించునప్పుడుఁగూడ విదురునిఁ దనచెంత గూర్చుండఁ బెట్టుకొని గౌరవించెను. ఇట్లు శ్రీకృష్ణుని సమాదరంబునకుఁ బాత్రుండగుటకు విదురుని

సత్ప్రవర్తనయు భక్తియుం దప్ప వేఱుకారణంబు లేదు.

ఇట్లే విదురుండు తనసత్ప్రవర్తనముచే బెక్కండ్రప్రీతి గౌరవములకుం బాత్రుండయ్యెను. కుంతీదేవి శ్రీకృష్ణునితో సంభాషించునపుడు "కృష్ణా! విదురుండు సద్గుణవంతుండు. ధర్మపరాయణుండు. తనకన్నులయెదుట నధర్మము వర్తించునేని చూచి సహింపలేక దానిని నుదముట్టింప మిక్కిలి ప్రయత్నించును. చూచితివా, నాఁడు సభలో మనద్రౌపది యవమానిత యగునపుడు చూచి సైరింపలేక భీష్మాదులవైపు దిరిగి "అయ్యా! సభలో నిట్టి యధర్మము వర్తిలుచుండుట నవలోకించి యూరకుండుట ధర్మముకాదు. ద్రౌపది యడిగిన ధర్మసందేహమును దీర్పవలెను. అట్లు దీర్పనేని సభ్యులు మహాపాతకమును బొరయుదురు. కావున నుపేక్షింపక యీ ధర్మసంశయమును దొలఁగింపుఁ" డని సభ్యులను బ్రోత్సాహించుటయే కాక తనకుం దాఁ గూడ నందులకు యత్నించెను. దుర్యోధనాదులకు జంకక యిట్లు ధైర్యముతో వర్తించువాఁడు విదురుఁడు దక్క వేఱొకఁడు గానరాఁడు లోకమిట్లు నిలిచి యుండుటకు విదురుని సత్ప్రవర్తనమే యాధార" మని ప్రశంసించినది.

విదురుం డొక్కరుఁడు దక్కఁగ
సదస్యు లెవ్వరును ధర్మసంశయ మిది గా
దను నారయ తనశీలము
కుదు రీలోకమున కంతకుఁ దలఁపంగన్.

ఇట్లు శ్రీకృష్ణభగవానునికిని, భీష్మాది కులవృద్ధులకును, గుంతీప్రభృతు లగునంతఃపురస్త్రీవర్గంబునకును గూడ శ్లాఘనీయుఁ డగువిదురుఁడు గుణములచే నింక నెవ్వరిస్తోత్రమునకుఁ బాత్రుఁడు కాఁడు.

## ౧౦

### విదురుఁడు తీర్థయాత్రకరుగుట

కృష్ణుని రాయబారము ముగిసినది. కాని ఫల మేమియును లేక పోయెను. కృష్ణుని ప్రయత్నమంతయును వ్యర్థమయ్యెను. మనోరంజకములు యుక్తియుక్తములు నర్థవంతములు శ్రేయోదాయకములు నగు నమ్మహానుభావుని వచనంబులు కౌరవుల తలల కెక్కలేదు. అతఁడు చెప్పఁ దలంచినంతవరకును జెప్పి మూర్ఖులగు కౌరవులయొద్దఁ దనపల్కులు నిష్ఫలంబులని యోజించి దుర్యోధనునితో నింక యుద్ధసన్నద్ధుఁడవు కమ్మని హెచ్చరించి వెడలిపోయెను. ఇఁకఁ గురుపాండవయుద్ధము జరుగునని యందఱును నిశ్చయించిరి. ప్రజలయందును సైనికులయందును గలవరపాటు హెచ్చయ్యెను. దుర్యోధనాదుల ధీరవచనములు విన్నప్పుడుతప్ప తదితరకాలముల ధృతరాష్ట్రుని హృదయము కంపించి పోవుచుండెను. కృష్ణుఁడు వెడలినపిమ్మట సంతతవిచారముచే నయ్యంధరాజునకు సరిగా నిద్రాహారంబులు లేవయ్యెను. అందుచే నతఁడుతొంటివలె విదురుని హితోపదేశమనెడి సుధారస ధారానేచనమునఁ దన హృదయ

సంతాపమును దీర్చుకొన నెంచి విదురుని బిలిపించి కూర్చుండు
మని నియోగించి కాఁగల కార్యసరణినిఁగూర్చి యడిగెను.
పరమేశ్వరుఁడగు కృష్ణుని రాయబారమును నిరసించి నప్పటి
నుండియు విదురునకుఁ బూజ్యుఁడయినను దనసోదరునిపై
మిక్కిలి కోపముదయించెను. ఇప్పుడతనికి ధృతరాష్ట్రుని
వచనములచే నొడలంతయునుమండఁజొచ్చెను. తనహితోపదేశ
ప్రకారము నడవలేనప్పుడు తిన్నట్లడుగు టెందులకని విదురుని
తలంపు. వచ్చినకోపము నడంచుకొని విదురుఁడు రాజునుగాంచి
యిట్లనియె. " సోదరా! కార్యగతిని గుఱించి యాదివఱ కనేక
పర్యాయంబులు నీకుపదేశించితిని. కాని నాయుపదేశములు
నీతల కెక్కలేదు. ఇట్టిచో నాయుపదేశములవలనఁ బ్రయోజన
మేమి? నామాటలు వ్యర్థమగుటయే కాక మీఁదు మిక్కిలి
మీకుఁ గోపముగూడఁ గల్గుచున్నది. అయినను హితోప
దేశమునుండి నేను విముఖుఁడను కాను. ఉత్తమపురుషుఁడు
తనవారి కాపద సంభవించు నెడ ముందుగానే తెలిసికొని దానిని
వారింపవలెను. అట్లొనర్చుట నాధర్మము. రాజేంద్రా!
నీ యుపేక్షవలనఁ గురుపాండవ యుద్ధము పొసఁగినది. అది
దావాగ్నివలె వంశనాశనము చేయకుండ విడిచిపోదు.
సామాద్యుపాయములలో దండోపాయ మధమ సాధనమని
నీతిజ్ఞులు వలుకుదురు. అట్టియధమసాధన మవలంబించి
ధనమానప్రాణములతోఁగూడ వంశనాశన మొనర్చుకొననేల
తలంచెదవు? పాండవులు యుద్ధమునకు దరలిరాకమునుండే

యిప్పుడైనను నీకొడుకు బుద్ధి త్రిప్పి వారితో సంధిచేసికొన యత్నింపుము. ఇంకను నిప్పటికిఁ గార్యము మించిపోలేదు. త్వరపడుము. లేనిచోఁ దరువాతఁ బశ్చాత్తాపతప్తులము కావలసి వచ్చును. యుద్ధంబున మీకు జయం బలవడుట యసంభవము. నీతనయులపేరు విన్నంతమాత్రముననే నడుమఁ ద్రొక్కఁబడిన కాలభుజంగమువలెఁ గోపంబునఁ గాఁగుచున్న భీమునినుండి నీతనయులు ప్రాణసంరక్షణము గావించుకొనలేరు. నేనిట్లు మాటలాడుచున్నానని కినియకుము. హితుఁడగువాఁడు ముఖప్రీతి వచనములుగాక యథార్థము చెప్పవలయును. రాజా ! లోకములోఁ గార్యసాధనమునకు దైవపౌరుషంబులు రెండును గావలయును. ఒకప్పుడు పౌరుషయత్నము లేకుండఁగనే దైవమువలనఁ గార్యము ఫలింపవచ్చును ; కాని దైవబలహీనమగు పౌరుష మెప్పుడును గార్యకారి కాదు. కావున నీకొడుకు లెంతబలవంతు లయినను నెంతటిసైన్యము గలవారైనను దైవబలంబు లేనప్పుడు వారు తృణప్రాయులనుటకు సందియ మున్నదా ? మనకొక్క పౌరుషముమాత్రమే కలదు. పాండవులకు రెండునుం గలవు. పరమేశ్వరుఁడగు శ్రీకృష్ణుఁడు సంతతమును " మమప్రాణాహి పాండవాః " యని పలుకుచు వారి పక్ష మవలంబించి వారికెట్టియిక్కట్టులు ప్రాప్తించినను నవలీలఁ దొలఁగఁద్రోయుచున్నాఁడు. ఆభగవంతుఁ డాదరుఁడై యుండఁ బాండవుల కపజయ మెట్లు సంభవించును ? వారికిట్లు దైవబలమే కాక పౌరుషము గూడ చాల కలదు. దిగ్విజేతలని

ప్రసిద్ధికెక్కిన రాజులు పెక్కండ్రు ధర్మరాజునకు వశులయి
యున్నారు. ఇంతియకాక యాదవులు బహుపరాక్రమ
శాలురు. వారికెల్లరికిని శ్రీకృష్ణుఁ డధినాథుఁడు. అతఁడు వారి
నందఱినిదన గుప్పిటలో నుంచుకొనుచున్నాఁడు. అట్టి శ్రీకృష్ణుఁడు
పాండవులకు బంధువై, హితుఁడై, సహాయుఁడై, మంత్రియై
వర్తించుచున్నాఁడు. ఇట్టి ప్రసన్నసౌభాగ్యంబులు గల పాండవులు
జయమందుటకు సందేహ మేమి యున్నది? నీ కుమారులకు
దైవబలము లేదు. వారు ప్రజానుగ్రహము లేనివారై భ్రాతృద్రోహులయి
యున్నారు. దైవవిరోధమునకు మానవులు తాళజాలరు. జయమెట్లగునో
కాక కులనాశనమును గూడ నొనరింపఁ జేసికొనును. కావున నీవు యింక
ముందుగానే కలగలిసి పాండవులతో సంధి చేసికొమ్మను. నీకొడు
కుల నంగీకరింపనిచో "త్యజేదేకం కులస్యార్థే" అనునట్లు
దుర్యోధనుని మాత్రముగాఁ దలఁచి తక్కిన కులమును సంర
క్షించుకొనుము. కాలవిలంబనము చేయకుము" అని యుపదే
శించెను.

ఈ యుపదేశమును విని ధృతరాష్ట్రుఁ డాలోచించుచుండ
దుర్యోధనుఁడు విని యాజ్యధారాప్రజ్వలితుండగు హుతహోత్రుని
చందంబున మండిపడి పండ్లు పటపట గొఱుకుచు, క్రోధాతి
రేకంబునఁ బెదవు లదర తనయొద్దనున్న కర్ణాదులు విను
చుండఁ దండ్రి సమక్షమునందే స్వామిభక్తిలుఁ డయ్యును విదురు నిట్లు
తిరస్కరించుచుఁ బలికెను. "ఓయీ! నీవు దాసీకుమారుఁడవు.
అయినను నస్మజ్జనకాదులు నిన్నాదరించుటం జేసి యింతవఱకును

నిన్నాదరించుచున్నాను. ఇట్లుండ నీవు నిన్ను మఱచిపోయి నోటికి వచ్చినట్లెల్ల వదరుచున్నావు. ఆ నీ దారుణవచనములను విని మాతండ్రి సహించిన సహించుఁగాక. నేను మాత్రము సహించువాఁడనుగాను. నీవు కుటిలాత్ముఁడవు. యుక్తాయుక్తంబు లెఱుఁగనివాఁడవు. సర్వదా మాయన్నము కడుపునిండ మెక్కుచుఁ 'దిన్నయింటికే కన్నములు ద్రవ్వు' నట్లు మాకే హాని గోరుచుందువు. నీవు మా శత్రువులలోఁ జేరినవాఁడ వగుటంజేసి నీవును మాకుశత్రువవే! ఇట్టి నీ మాటలను బాటించువా రెవ్వరు నిచ్చట లేరు. నీవంటివాఁ డుండిన మాకీఁకఁ జేటు మూఁడుట సిద్ధంబు. కావున నీ విటనుండఁ జనదు. నీయిష్టము వచ్చినచోటికిఁ బొ" మ్మనియెను.

దుర్యోధనుఁ డిట్లు వదరుచున్నపుడు ధృతరాష్ట్రుండు విని యూరకుండెను గాని కొడుకు నావంతయుఁ గోపింపలేదు.

విదురుఁడు దుర్యోధనుని పలుకులు చెవులకు ములుకుల వలె నాటినఁ గటకటంబడి, సజ్జనుఁడగుటచే వచ్చిన కోపంబు నడంచుకొని యట్టిచో మాటాడ నిష్టపడక చేతనున్న ధనుర్బాణములు విడిచిపెట్టె రాజు సమ్ముఖమును బాసి వెడలి వచ్చెను.

అనంతరము విదురుఁడు మరలివచ్చుచుఁ గురుపాండవ యుద్ధము తప్పదనియు, నిటనుండి జ్ఞాతివధజనితమగు దుఃఖ మనుభవించుచుండుటకంటె భగవంతుని మహిమ నెన్నుకొనుచుఁ బరమేశ్వరునకును సాధుపుంగవులకును విహారభూమి

లగు దివ్యక్షేత్రముల సేవించుకొనుటకు యుత్సుకమానియుఁ దల పోసి యెవ్వరితోను జెప్పకుండ హస్తిపురంబు వెడలెను.

విదురుఁ డిట్లు దేశాటనంబునకు దొరకొని పరిశుద్ధచిత్తవృత్తియై, మనోహరములగు దివ్యమందిరములతోను, సకల కుసుమ ఫలభరిత తరునికరసమ్మిళితంబులగు నుద్యానములతోను, సమున్నతములగు క్రీడాపర్వతములతోను, నానావిధ పుష్పలతావృతంబులగు పొదరిండ్లతోను, నొప్పుచున్న పురంబులఁ జూచుచు, నిర్మలోదక ప్రవాహశోభితలగు నదులందుఁ గ్రుంకు లిడుచుఁ, బరమేశ్వరుని నానావిధదివ్యరూపంబులతో విరాజిల్లు పుణ్యక్షేత్రములఁ దిలకించుచు నవ్యభిచరితయగు భక్తిగలవాఁడయి, పవిత్రమగు జీవనముగలవాఁడై కటికినేలఁ బండుకొనుచు, జటావల్కలాంబరములఁ దాల్చి యెవ్వరికిని దెలియఁ బడకుండ వర్తించుచున్నవాఁడై, సంతతము హరిసంప్రీతిదాయకములగు వ్రతముల నాచరించుచు భరతవర్షమునందంతటను గ్రుమ్మరెను. ఆసమయమున విదురుఁ డొకచోట రెండు వెదుళ్లవలన జనించినయగ్ని సమస్తవనంబును దహించినచందమునఁ గురుపాండవవిరోధము సమస్తరాజక్షయమును గావించె ననియు, నిట్లు యుద్ధంబున జయింపఁబడిన భూమండలమును ధర్మరాజే కాతపత్రముగా నేలుచుండెననియు విని మిగుల విచారించుచు జ్ఞానాతిశయమున బంధునాశజనితదుఃఖమును దొలఁగించుకొని తీర్థయాత్రాపరాయణుండై, పశ్చిమాభిముఖముగా బోయి సరస్వతీనదీనిర్మలోదకంబునఁ గ్రుంకులిడి యచటనున్న

పమనేకంబులగు తీర్థంబులను సేవించెను. మఱియు ఋషి నిర్మితములు దేవనిర్మితములు శంఖచక్రాదిహరిచిహ్న విరాజితములు నగు దేవమందిరములఁ బ్రవేశించి యాయా దేవతల భక్తియుక్తుఁడై పూజించి విదురుఁ డటఁ గదలి సకలసంపదలతోఁ దులదూఁగుచున్న సౌరాష్ట్రమును జేరి యచ్చటి విశేషము లరసి సంతుష్టహృదయుఁడయ్యెను. పిమ్మట నతఁడు మత్స్యదేశంబున కరిగి యందలి పుణ్యతీర్థములను సేవించుచు, నిట్లె కురుజాంగలాది దేశములఁ గ్రుమ్మరి కొంతకాలమునకు యమునాతీరమును జేరెను.

## ౧౧

అనంతరము విదురుఁడు లోకపావనియు, మహానదులలో నొకటియునగు యమునలో యథావిధి స్నానమాచరించి నిరస్తసమస్తసంతాపుఁడై క్షౌమవస్త్రంబుభాతి నతిధవళంబును, నతిపేశలంబును, సికతాతలంబును నగు తదీయతీరంబున నుపవిష్టుండయి యీశ్వరారాధనమును గావించుచున్న సమయంబున, శ్రీకృష్ణానుచరుఁడు, బుద్ధిమంతుఁడు, బృహస్పతి శిష్యుఁడు, పరమభాగవతోత్తముఁడు నగు నుద్ధవుఁ డచ్చటి కరుదెంచెను. విదురుం డమ్మహానుభావునిఁ గాంచి సంతోషముతోఁ డాయంజని కౌఁగిలించుకొని, యుచితమర్యాద లాచరించి యొక్కచోఁ గూర్చుండి యతనితో నిట్లనియె.

### విదురుఁడు కృష్ణాదుల కుశలం బడుగుట

“ఓ మిత్రమా! చిరకాలంబునకు నిన్నుఁ జూడఁ గంటిని.

భవదీయ దర్శనలాభంబున నే నమితానందము నొందు
చున్నాను. ద్వారకానగరంబున మనబంధువులందఱును సుఖులే
కదా? బలరామకృష్ణులు పురాణపురుషులు. వారు బ్రహ్మ
ప్రార్థన నంగీకరించి భూభారముదీర్ప నవతరించిన మహాను
భావులుకదా? వారు సమస్త దుష్టసంహారంబు గావించి తా
మవతరించిన కార్యమును సంపూర్తి గావించుకొని యున్నారు.
ఆమహాత్ములకు క్షేమమే కదా? వారిజనకుండగు వసుదేవుండు
కురువంశసంభూతులనగు మాకు మిత్రుండే కాక బాంధవుండు.
అతనికిఁగల సోదరప్రేమ లోకములో వేఱొకరికిలేదు. అట్టి
వసుదేవుఁడు సుఖియై యున్నాఁడా? మఱియు నుగ్రసేనుఁడు,
యదు, వృష్ణిభోజాంధక కులప్రజల కధిపతియై వర్ణాశ్రమ
ధర్మములు చెడకుండ వారిని దన శేముషీవిశేషమునఁ
బాలించుచుఁ బరమేశ్వరుఁడగు కృష్ణుని యనుగ్రహంబునకుఁ
బాత్రుఁ డయినవాఁడు ఆ యుగ్రసేనుఁడు సుఖియే కదా?
కృష్ణుని పెద్దకుమారుఁడగు ప్రద్యుమ్నుఁడు పూర్వభవంబున
మన్మథుఁడే కదా! రుక్మిణీదేవి యెన్నియో నోములునోచి
దైవానుగ్రహమువలన నామన్మథునిఁ గుమారునిగాఁ బడసి
నది. అట్టి ప్రద్యుమ్నుఁడు సుఖియేకదా? సాంబుఁడు జాంబ
వతీదేవి ముద్దుకుమారుఁడు. అతఁడు కుమారస్వామి యవ
తారమని చెప్పుదురు. జాంబవతి తన పూర్వపుణ్య
విశేషమువలన నట్టి సుపుత్రునిఁగాంచఁ గల్గినది. ఆసాంబుఁడు
క్షేమముతో వర్తించుచున్నాఁడా? శ్రీకృష్ణుని సహోదరుఁడును

నసామాన్యవీరుఁడును, నర్జునునివలన సకల ధనుర్విద్యా రహస్యములఁ గాంచియున్నవాఁడు నగు సాత్యకి కుశలియే కదా ? విష్ణుభక్తాగ్రేసరుండును, వివేకసంపన్నుండును, బాపరహితుండు నగు నక్రూరునకు క్షేమమే కదా? దేవకీదేవి పరమపతివ్రతలలో మూర్ధన్యురాలు. ఆమె మహాభాగ్యవతులలో భాగ్యవతి. యాగరూపార్థమును దాల్చిన శ్రుతివలె నామె భగవంతుని గర్భంబున దాల్చినది. ఆ యుత్తమురాలికిఁ గుశలమే కదా? అనిరుద్ధుఁడు మొదలగు యాదవకుమారు లందఱును సుఖవంతులే కదా? ఓమహాత్మా! ఇఁక హాస్తినాపుర వృత్తాంతములేమి? తనకు భుజసమానులగు కృష్ణార్జునులచే సంపాదింపఁబడిన రాజ్యమును ధర్మయుక్తముగా ధర్మరాజు పాలించుచున్నాఁడా? కృతాపరాధుల కౌరవుల పేరు విన్నంతనే సల్లత్రాఁచువలె మహాకోపముతో బుసకొట్టుచుఁ దన పాదతాడనములచే భూమి యల్లలనాడ నతివిచిత్రగతి గదాయుద్ధముచేసి కురుకుమారుల నందఱను సంహరించిన మహాభుజశాలి యగు భీమునకు క్షేమమే కదా? తన ధనుర్విద్యా పాండిత్యముచే మాయా కిరాతుఁడగు నీశ్వరుని మెప్పించి పాశుపతమును గొన్న యర్జునుండు తన శత్రువుల నందఱను జయించి సుఖముగా వర్తించుచున్నాఁడు కదా? కుంతీదేవికి ముద్దుకుమారులగు నకులసహదేవులు స్వర్గమునుండి యమృతముఁగొని తెచ్చిన గరుత్మంతునివలె శత్రుపురములనుండి ధనంబులఁగొనివచ్చుచుఁ గుశలులై యున్నారు కదా? అతిరథశ్రేష్ఠుఁడును దనకుఁ

బ్రాణపదంబునగు పాండురాజు మునిశప్తుండై పరలోకమునకుఁ బోవుచుండఁ బుత్రసంరక్షణార్థమై సహగమనము మాని ప్రాణముల నిలువఁబెట్టుకొన్న యుత్తమురాలగు కుంతీదేవికిఁ గుశలమే గదా? ఓయుద్ధవా! తండ్రిలేని పాండవులను జక్కని ప్రేమతోఁ జేరదీసి పెంచుట ధృతరాష్ట్రుని కర్తవ్యమైయుండ నాతఁడు న్యాయాన్యాయంబులను, గుణాగుణంబులను బాటింపక దుష్టబుద్ధి యగు కొడుకు ననుసరించి ధర్మరాజాదులకు ద్రోహము చేసి యున్నాఁడు. మావంటి హితులు చెప్పు హితోపదేశ మతనిచెవి కెక్కలేదు. నా హితవచనములు వినక పోవుటయే కాక నన్ను నా దుర్యోధనుండు నానాదుర్భాషలాడి పురమునుండి పొమ్మనుచుండ నిది తెలిసియు నా మహారా జూరకుండెను. కులనాశనమున కతని యుపేక్షయే కారణము సుమా! నేనట్లు తిరస్కృతుండనై హాస్తిపురి వెడలి ప్రచ్ఛన్న వేషధారినై తీర్థముల సేవించుకొనుచు, నత్యాశ్చర్యకరంబగు జగంబునువీక్షించుచు సంచార మొనర్చుకొనుచున్నాను. అందు వలన నామనంబు నిర్మలమై నిశ్చలమై శ్రీకృష్ణుని యందుఁ బొందుపడియున్నది. ఆహా! శ్రీకృష్ణునిచర్యలు వర్ణనాతీతములు గదా! అభిజాత్యాదులవలన మదాంధులయి వర్తించు దుష్ట క్షత్రియులను బరిమార్చి భూభారమును దీర్ప నెంచియే భగవంతుఁ డగు కృష్ణుఁడు భారతయుద్ధకారణంబునే వారి నందఱి నొక్కచోఁ జేర్చి చంప నిశ్చయించుకొనెను. కావుననే రాయబారమునాఁడు సభలో దుర్యోధనుఁడు తన్ను దుర్భాషలాడినను

సహించి యూరకుండెను. లేనిచో నాస్త్రాత్ముఁడగు దుర్యోధనుని సంహరింపలేకపోవునా? నాఁటికృష్ణుని శుభగుణా మునకు మేమందఱ మాశ్చర్యచకితుల మయితిమి. ఆహా! పరమేశ్వరుని సంకల్పము తెలిసికొన దురవగాహముకదా! లోకములోఁ దనభక్తుల నుద్ధరింప నవతరించిన యాకృష్ణుని క్షేమోదంతమును దెలుపుమా! నామనసు మిగులఁ గుతూ హలపడుచున్నది. అని యుత్కాదరంబున నడుగుచున్న విదు రునిఁ గాంచి యుద్ధవుండు సంభవించిన యాపద నెట్లు లితనికి దెల్పుదునని విచారించుచుఁ గన్నులనుండి ప్రోడమగు జలధార లను విడిచికొన్ని యొక్కపరి శ్రీకృష్ణ భగవానుని స్మరించు కొనుచు నెలుంగు రాల్పడ మెల్లమెల్లన విదురున కిట్లనియె.

### ఉద్ధవుఁడు విదురునికిఁ గృష్ణనిర్యాణమును జెప్పుట

"ఓ విదురా! మాకుశల మేల యడిగెదవు? దాని నే నేమని చెప్పఁగలను? కృష్ణుండను చండభాను వస్తమించుటం జేసి కాలమనెడి మహాసర్పము నిరర్గళముగా మాగృహము లందు సంచరించుచు మా యాదవు లందఱి ప్రాణవాయువుల నపహరించినది. అక్కటా! భూలోకమిఁక దురదృష్టమయినది. అందులో యాదవులు మిక్కిలి దురదృష్టవంతులని చెప్పవలయును. సముద్రమందుఁ జరించు జలచరములు మహా నావను జూచి దానిని దమవంటి జంతువును గానే భావించును గాని సాగరతరణసాధన మని భావింపలేవు. అట్లే యజ్ఞా నాంధకారమున మునిఁగిన యాదవులు తమతో వసించియున్న

కృష్ణునిఁ దమబోటి యొక సామాన్యమానవునిగా భావించిరి. కాని భీకరసంసారసాగరతారకుండగు పరమేశ్వరుండని గ్రహింప లేకపోయిరి. వినుమురా! ఆకృష్ణుం డొనర్చినచర్య లత్యద్భుతములు గదా ? అతఁ డవతరింపఁగానే వసుదేవుఁడు కంసభయంబున నతని నందునియింటఁ జేర్చెను. అతఁ డచ్చట దినదినప్రవర్ధమానుఁ డగుచుండెను. అది తెలిసికొని కంసుఁ డాత్మమృత్యుకారకుండగు కృష్ణునిఁ జంప నెన్నియో మాయా తంత్రములు పన్నెను. వానినెల్ల మాయామానుషవేషధారియగు కృష్ణుండే వ్యర్థములుగా నడఁగించెను. ఇంతయేల ? అతఁడు శిశువయి యుండఁగనే పూతనయను రక్కసి పాలిచ్చునెపమున నతనిఁ జంప యత్నించి యతనిచేతనే సంహరింపఁబడియె. పిమ్మట శకటాసురుఁడు వత్సాసురుఁడు ధేనుకాసురుఁడు మొదలగువా రెందఱో యతనిఁ జంపవచ్చిరి. భయంకరమగు రాక్షస రూపములతో వచ్చిన యా దురాత్ములను బాలుఁడగు నాకృష్ణుండే యుపాయములచే నుక్కడంచెను. దేవేంద్రుని ధిక్కరించి గోవర్ధనగిరిని ఛత్రముగాఁబట్టి గోగోపాలురనెల్ల సంరక్షించెను. ఇట్టి కృత్యములు మానవమాత్రు లొనర్పఁ గలరా! ఆహా! అతఁ డొనర్చినవన్నియు నమానుషకృత్యములే గదా! ఇంద్రాదులను జయించి పారిజాతంబును గొనివచ్చెను. విషానలజ్వాలాభయంకరుఁడగు కాళీయుఁడను నాగరాజును మర్దించి కాళిందీనదిని నిష్కంటకంబు గావించెను.

మదమత్తములై భయంకరము లయిన వృషభంబుల

నేడింటిని మర్దించి నగ్నజిత్తొనర్చిన ప్రతిజ్ఞ నొనేర్చి తదీయ పుత్రికను బెండ్లియాడెను. శిశుపాల జరాసంధాది రాజలోకమును జయించి తన్నుఁ ప్రేమించిన రుక్మిణిని రాక్షసవివాహమునఁ బరిణయ మాడెను. ఇంతయేల ? చిన్నతనంబున సాందీపునివలన విద్యాభ్యాస మొనర్చుచు మృతుఁడయిన తదీయ పుత్త్రికుని గొనితెచ్చి బ్రతికించి యతని కర్పించెను. ఓ విదురా ! శ్రీకృష్ణుని యద్భుతకృత్యముల నెల్లింతని వర్ణింపఁగలను ? ఆ పరమేశ్వరుఁ డీట్లవతరించి దుష్టరాజలోకంబును రాక్షసలోకంబును సంహరించి భూభారమును దీర్చెను. కురు పాండవ యుద్ధమును గల్పించి దానివలన భూభారమును బూర్తిగాఁ దొలఁగించెను. అసహ్యహంతులగు యాదవుల నందఱను దుదముట్టించినఁ గాని, తన సంకల్పము నెఱవేఱదని యెంచి వారినందఱను ప్రభాసతీర్థమునకు గొంపోయి వారిచే స్నానాదులను జేయించి దేవపితృతర్పణంబులు గావింప నాజ్ఞాపించి యనంతరము వారిచే షోడశమహాదానంబులను జేయించెను. ఆ పిమ్మట వాసుదేవుఁడు వారితోఁ గూడ నట భుజించి యా యాదవులచే మద్యపానము చేయించెను. దానివలన వా రుచితజ్ఞానశూన్యులై యొకరినొకరధిక్షేపించుకొనుచు మద్యదోషమువలన విపరీతచిత్తు లయి రెండుపక్షములయి సంకులసమరముగావించి పరస్పరహతులయి సాయంసమయమునకుఁ బూర్తిగా నశించిరి. వేణుమర్దన జనితమగు దావాగ్నివలన వనమంతయును భస్మీభూత మైనట్లు

యాదవులలో నొకరిద్దఱకు సంభవించిన విరోధము సకల యాదవ సంక్షయకారి యయ్యెను. భగవంతుఁడు యాదవ నాశమునుచూచి దానితోఁ దనయవతారకృత్యము పూర్తిగా నెఱవేఱినదని గ్రహించి యచ్చటనుండి సరస్వతీనది కరిగి యందు మునుకలిడి తత్తీరంబుననున్న యశ్వత్థపాదవ మూలమున నుపవిష్టుఁడయ్యెను. ఓ విదురా! ఆ భగవంతుఁడు మునుముందె తపంబొనర్పఁగొన బదరికావనంబునకుఁ బొమ్మని నా కాజ్ఞాపించెను. అయినను నేను దదీయవియోగమును భరింపఁ జాలక యతని వెనువెంటనే పోసాగితిని. తత్తరు మూలంబున నసహాయుఁడయి కూర్చుండిన వాసుదేవునిగాంచి మెల్ల మెల్లన వినయావనతుఁడనయి తదీయసన్నిధిని జేరి యుపవిష్టుండనైతిని. ఆ సమయంబున వ్యాసమహర్షి మిత్రుఁడును, భాగవతాగ్రగణ్యుఁడును నగుమైత్రేయమహాముని లోకసంచార మొనర్పుచు దైవికముగా నచ్చటి కరుదెంచెను. మైత్రేయుం డుచితమర్యాద లంది కూర్చున్నపిమ్మట భగవంతుఁడు నన్నుఁగాంచి, "ఓయుద్ధవా! నీవు పూర్వజన్మమందును నీజన్మ మందును నాకుఁ గూర్చిన భక్తుండవు. నా యనుగ్రహంబునకు బాత్రుండ వయితివి. నీకర్మజాల మంతయు నశించినది. నీకు జన్మాంతరము లేదని పలుకఁ, నే భక్తివినయ వినమితగాత్రుండ నయి యతని నుతించి తత్త్వజ్ఞాన ముపదేశింపుమని ప్రార్థింప నన్నతఁడు నమాదరించి యట్లు కావించెను. పిమ్మట నతని పాదపద్మములకు నమస్కరించి తదీయానుమతిని దలదాల్చి

భగవదనుగ్రహము నతికష్టముచే నొంది బదరికాశ్రమమునకుం బోవుచు నిట్లువచ్చితిని. భగవంతుఁడునాకువలెనే మైత్రేయునకు దివ్యజ్ఞాన ముపదేశించి యవతారము చాలించియున్నాఁడు. ఇఁక యాదవ పాండవుల క్షేమోదంత మేమని చెప్పెదను? పరమేశ్వరుని సంకల్పమునకుఁ బ్రతికూలముగా నెవ్వరు నిలువ నోపుదు" రని యుద్ధవుఁడు పలుక విదురుఁడు తన బంధు మరణంబునకు దుఃఖించియు జ్ఞానబలంబున ధైర్యమువహించి యుద్ధవునితో "ఓయీ! నీవు భగవదనుగ్రహపాత్రుఁడవు పరమ పవిత్రుఁడవు. నీవాభగవంతునివలననుపదేశముగన్న దివ్యజ్ఞానము నాకొకింత యుపదేశించి నన్నుద్ధరింపుమా" యని ప్రార్థించెను. అందుల కుద్ధవుండు "ఓవిదురా! నేను దత్త్వజ్ఞాన ముపదేశించు నంతటి శక్తిగలవాఁడనుగాను. మైత్రేయుఁడు మిక్కిలి మహాను భావుఁడు. తపశ్శాలి. జితేంద్రియుఁడు. తత్త్వజ్ఞాన ముపదేశించు నవుడు భగవంతుఁడు సర్వదా తీర్థసంచారము సేయుచును నడిగిన వారికి జ్ఞాన ముపదేశింపు మని మైత్రేయున కాజ్ఞాపించి యున్నాఁడు. నీవతని సన్నిధిఁజేరి జ్ఞానంబు వడయుట యుత్త మం" బని చెప్పి విదురుని వీడ్కొని యుద్ధవుండు బదరికావనం బున కరిగెను. పిమ్మట విదురుం డుద్ధవుని పరమపుణ్యమున కాశ్చర్యము నొందుచు నతనిఁ గృతకృత్యునిగా భావించుచుఁ దీర్థసంచార మొనర్చి మైత్రేయుని సందర్శించి జ్ఞానోపదేశంబు నొంది తాను కృతార్థుఁడు గాఁదలంచి పాదచారియై పోయి పోయి కొన్నిదినంబులకు హరిద్వారంబు చేరెను.

## ౧౨

### విదుర మైత్రేయ సంవాదము

విదురుఁడు పరమభక్తిసంపన్నుఁడు. నిర్మల హృదయుఁడు. పరుల కుపదేశింపఁ దానెంత సమర్థుఁడో పరులవలనఁ దా నుప దేశము నొందుటలోఁ గూడ నంతటి యభిలాషిష్ఠుఁ డనుటకు సందియములేదు. ధర్మసంస్థాపనార్థము దేవతల కోర్కి చొప్పున లీలామానుషవిగ్రహాధారియైన శ్రీకృష్ణభగవానుఁడు తత్త్వజ్ఞాన నిధానమును మహానుభావుఁ డగు మైత్రేయమహా మునియందు నిక్షేపించి యవతారంబును జాలించెనని విన్న ప్పటి నుండియు విదురుఁడు సంతతమును మనంబులోఁ జెప్పు డా మైత్రేయుని సందర్శింతు? ఇఁకెప్పు డాతనివలనఁ బరమాత్మతత్త్వంబు నుపదేశంబు గాంతు. నని తహతహ పడుచు మైత్రేయాన్వేషణము దప్పఁ దదితరకార్య విము ఖుఁడై నిద్రాహారంబులు విడిచి రాత్రిందివములు విశ్రాంతిఁ జెందక పోయిపోయి యొక్కచో మైత్రేయునిఁ గాంచెను. అతఁ డట్టిమహామహుని సందర్శింపఁగాఁ గలిగినందులకుఁ దనయదృష్టము నెన్నుకొనుచు నతనికి నమస్కరించి తదీయ సౌశీల్యాదిసద్గుణంబుల కచ్చెరు వందుచు నిట్లనియె: "ఓ మహాత్మా! లోకమంతయు సౌఖ్య మపేక్షించి శ్రౌతస్మా ర్తాదికర్మకలాపము నాచరించుచున్నది. కాని, తదాచరణమువలన సుఖముగాని దుఃఖోపశాంతిగాని కాంచినట్లు లేదు. నీవు సర్వజ్ఞుండవగు మహానుభావుఁడవు గాన నీకుఁ దెలియని

యంశములుండవు. ముందుగా మానవు లాచరింపవలసిన కర్మము లెవ్వియో వివరింపుము. ఓ మహానీయా! దుఃఖమయమైన సంసారసాగరంబునఁ బడి దరిగానక భగవద్భక్తి విదూరులై యధర్మపరులై కర్మానుగతంబు లగుశరీరంబులను దాల్చి యతిదుఃఖము లనుభవించుచుఁ జచ్చుచుఁ బుట్టుచు నెప్పటికయినను ముక్తినొందఁజాలక పశుప్రాయు లయి వర్తించువారి నుద్ధరించుటకేకదా భవాదృశు లీలోకంబున వర్తించుచున్నారు. కావున మావంటివారికి సదుత్తరములిచ్చి రక్షింపుము. భగవంతుఁ డెట్లారాధించిన సంతోషించును? ఎట్లు పూజించిన నప్పరమేశ్వరుండు భక్తినిర్మలమగు హృదయమున నెలకొనియుండును? ఏమిచేసినచో భగవదనుగ్రహమునకుఁ బాత్రుఁడై పురుషుఁడు దివ్యజ్ఞానము నొంద సమర్థుఁడవును? ఆపరమేశ్వరుఁడు బ్రహ్మాదిరూపములనొంది ప్రపంచము నేరీతి సృష్టించును? ఎట్లు పరిపాలించును? ఎట్లు లయము గావించును? ఒక్కఁడగు పరమేశ్వరుఁడు నానారూపముల నెట్లు దాల్చుచున్నాఁడు? గోబ్రాహ్మణాది సాధుజంతు రక్షణమునకై పరమేశ్వరుఁడు మత్స్యాద్యవతారముల నెత్తి క్రీడించుచు నేయే కార్యము లాచరించెను? ఆ లీలలను సవిస్తరముగా వర్ణింపుమా? వాని నెంతో విన్నను నామనంబు తృప్తి చెందనేరకున్నది. పరమేశ్వరుని లీలాదులను సర్వదా వినుచున్నచో మానవుల హృదయములం దతఁడు నెలకొని వారిని సంసారదుఃఖ విముఖులనుగాఁ జేయుచున్నాఁడు.

ఓమహాత్మా! సత్కథాగోష్ఠివలన మానసము నిర్మలమగును. నిర్మలహృదయంబున సుక్షేత్రమునందువలె జ్ఞానబీజంబు లంకురించి వర్ధిల్లును. అందువలన మానవులు క్రమముగాఁ బరమభక్తులై సంసారవిదూరులై ముక్తిఁగాంచఁ గలుగుదురు. హరికథాశ్రవణమువలన నిట్టిలాభ ముండఁగా వానిని విన నెవ్వఁడు కుతూహలపడఁడు? కావున నానాపుష్పజాతమునుండి మధుకరము మధువును గూర్చినట్లు నానాగ్రంథజాలము నుండియు సంసారతారకములగు హరికథలను క్రోడీకరించి యుపదేశింపుమా? నీవు పరమాత్మతత్త్వము నుపదేశింతు వనియే నిన్ను వెదకికొనుచు నింతదూరము వచ్చితిని; దయయుంచి నాకీ మహోపకార మొనర్పుమా?" యని ప్రార్థించుచున్న విదురునిగాంచి మైత్రేయుఁ డెంతయు సంతసించి యతని నుచితవిధముల సత్కరించి యిట్లనియెను.

"ఓవిదురా! నీవు చేసిన ప్రసంగమున కానందించితిని. లోకహితార్థమై నీ వడిగిన ప్రశ్నములు మిగుల శ్లాఘనీయములుగదా! మఱియు నీవు నిర్మలహృదయుఁడవు. అశేషసుగుణసముపేతుఁడవు. నానావిధ నీతిశాస్త్రపారఁగుఁడవు. విష్ణుభక్తుఁడవు. మాండవ్యుని శాపవశమున భూలోకమున నవతరించిన ధర్మపురుషుఁడవు కాని నీవు సామాన్యుఁడవా! నీవంటి యుత్తమపురుషుఁ డిట్టి సత్ప్రసంగ మొనర్చుట వింతకాదు. ఓ విదురా! నీవు విష్ణుభక్తాగ్రేసరుఁడ వయిన తదీయానుగ్రహంబునకుఁ బాత్రుఁడ వగు మహానుభావుఁడవు;

ఓపుణ్యాత్మా! నేను దైవికముగా నిర్యాణకాలమునకు సరిగా నేనాకృష్ణ భగవానుని సన్నిధి కరిగితిని. ఆ పరమేశ్వరుఁడు నన్నుఁ జేరఁ బిలిచి, దివ్యజ్ఞాన ముపదేశించి, లోకమందు విస్తరింపఁజేయు మని యాజ్ఞాపించి, యందు ముఖ్యముగా విదురున కుపదేశింపుమని మఱిమఱి చెప్పెను. ఆహా! ఇంత కంటె నీకుఁగావలసిన దేమి? ఏమహాత్ముని యోగీంద్రులు యోగమార్గముల నతికష్టమునఁ గాంచఁగల్గుదురో, యేపవిత్ర మూర్తి పావననామాక్షరము లంత్యకాలమున నొకపరి నోటితో నుచ్చరించి మానవులు ముక్తిఁ జెందుచున్నారో యట్టి భగవంతుఁడు తన నిర్యాణసమయమున నీపావననామా క్షరము లుచ్చరించి యున్నాఁడు. నీ గుణగానమును జేసి యున్నాఁడు. నీవంటిభాగ్యసంపన్నుఁడు మఱి లోకమునం దెవ్వఁ డున్నాఁడు! పరమేశ్వరుని పరమానుగ్రహంబునకుఁ బాత్రమగు నీజన్మము సార్థకమైనదని వేఱె చెప్పవలయునా? నేను నిమిత్త మాత్రుఁడనై యుపదేశించుటయే కాని నీకుఁ దెలియని యంశము లేమి కలవు? అయినను భగవంతుఁ డుపదేశించిన తత్త్వమార్గమును జెప్పెద వినుము.

### మైత్రేయుఁడు విదురునకుఁ దత్త్వ ముపదేశించుట

"ఓ విదురా! పరమేశ్వరుఁ డనంతశక్తులు గలవాఁడు. అచంచలుఁడు. అచ్యుతుఁడు. అవికారుఁడు. ఆకాశమువలె నంతటను వ్యాపించి యున్నవాఁడు. అతఁ డవాప్తసమస్త కాముఁడు. జ్ఞానైకాకారుఁడు. జలము నంటిపెట్టుకొనియున్న

నాఁచువలెఁ బరమాత్మ నెల్లకాలము నాశ్రయించుకొని మాయ యను శక్తి యొకటికలదు. దానికే ప్రకృతియనియు, నవిద్య యనియు పేళ్లు గలవు. ఈ ప్రకృతి నానావిధ రూపములుగాఁ బరిణమించు స్వభావముగలది. అది పరమేశ్వరుని కాటవస్తువు వంటిది. అతఁడు దానిని లోఁబఱచుకొని తత్సహాయమునను లీలాసార్థమై యీ ప్రపంచమును సృజించుచున్నాఁడు. అతఁడు సంకల్పించిన మాత్రముననే ప్రపంచముత్పన్నమగుచున్నది. అతని వికల్పమాత్రముననే యది నశించుచున్నది. ఇట్లతఁడు సర్వదా ప్రకృతిసంబంధము గలవాఁడయ్యును దదీయగుణదోషము లేవంతయు నతనిఁ జెందవు. వక్రకాష్ఠమును దహించు నగ్నికి నాశ్రయమునుబట్టి వక్రత్వ మగ్నికి గానవచ్చుచున్నను నతనికి స్వభావసిద్ధముగా నట్టిదోషము లేదు. జలమందుఁ బ్రతిబింబించిన చంద్రునకు జాంచల్యాది గుణములు ప్రతీయమానము లగుచున్నను వాస్తవముగా నాకాశగతచంద్రున కట్టివి లేవు. కాష్ఠగత దోషము లగ్నియందును, జలగతదోషములు వాస్తవిక చంద్రునందును నారోపితము లగునట్లు మాయాగత గుణములు నిష్కళంకుఁ డగు పరమాత్మయం దారోపింపఁబడు చున్నవి. అది కేవల మజ్ఞానజన్యమైనది. సామాన్యులీ సంబంధమును గ్రహింపనేరక భ్రాంతి చెంది సంసారపతితులై సుఖదుఃఖము లాత్మ కారోపించుచున్నారు. దేహమునే యాత్మనుగా భావించి దేహగతదోషము లాత్మ కారోపించుచున్నారు.

ఆత్మ యెప్పుడు నొక్కటియె. ఘటాది పదార్థములవలన మహాకాశము నానాత్వమును జెందునట్లు పరమాత్మ యస్మదాది దేహములవలన ననేకత్వము నొందుచున్నాఁడు. ఘటాది పదార్థములు నశింపఁగానే యాకాశమంతయు నొకటి యయిన విధమున నస్మదాదిశరీరములు నశింపఁగానే మన యాత్మ లన్నియు నొక్కటి యగుచున్నవి. ఉపాధివశమున నిట్టిభేదము గల్గుచున్నది. ఉపాధిగత మైనప్పుడే యాత్మ జీవ సంజ్ఞను జెందుచున్నాఁడు. ఆ జీవుఁ డజ్ఞానవశమునఁ దన స్వస్వరూపమును మఱచి జరామరణాది దుఃఖములఁ దనయం దారోపించుకొని సంసారి యగుచున్నాఁడు. ఇట్లు సంసారియగు జీవునికి ముక్తి యెట్లు గల్గునో వినుము. మానవుఁడు తన కులాచారధర్మములను వదలక వర్తించుచుఁ దీర్థయాత్ర లొనరింపవలయును. దానివలన సాధుసందర్శనము లభించును. దానివలన సాధుజనమైత్రి సంభవించును. ఆమైత్రివలనఁ బాపకార్య పరాఙ్ముఖుఁ డగును. పాపవిముఖుని చిత్తము క్రమముగా నిష్కళంక మగును. సారవత్తరమగు భూమియందువలె నిర్మల చిత్తంబున జ్ఞాన బీజంబులు మొలిచి వర్ధిల్లును. సుక్షేత్రమందలి సస్యము పెరిగి తృణాదుల నడుగంటఁజేయునట్లు నిష్కళంక చిత్తమున జ్ఞాన మంకురించి క్రమముగా వర్ధిల్లి తక్కిన దోషాదులనెల్ల నడచి వేయును. అట్టి జ్ఞానబలమునఁ బురుషుఁడు ప్రకృతిసంబంధమును దెలిసికొని తజ్జన్యదోషములనెల్లఁ బరిహరించుకొని తన నిజరూపమును దెలిసికొన సమర్థుఁ డగుచున్నాఁడు. ఎప్పుడు

జీవుఁడు తనరూపమును నెఱిఁగి తాననుభవించుచున్న సుఖ దుఃఖాదులు ప్రకృతిజన్యములని గ్రహించెనో యప్పుడే యతఁడు ముక్తుఁడగును కావున ముందుగాఁ బ్రకృతి పురుషవివేక మెఱుఁగవలయును. అట్లయినచోఁ బరిదృశ్యమాన మగు ప్రపంచమును, దేహమును బురస్కరించుకొని వచ్చిన పితృమాతృపుత్త్రాది సంబంధములును, గేవల మజ్ఞానకల్పితము లని తెలిసికొని మానవుఁడు రాగద్వేషాదులవలనఁ గల్గిన సుఖాసుఖములను బోరఁదుక నిత్యసంతోషియై ముక్తి చెందును.” అని యిట్లు మైత్రేయుఁడు విదురున కధ్యాత్మతత్త్వమును, నానావిధ ధర్మములను, నానావిధ సృష్టి వైచిత్ర్యములను, బ్రహ్మాండాది పరిణామములను వివరించి చెప్పినఁ విని యతఁ డధికానందము చెంది మైత్రేయునకు నమస్కరించి యతని గుణగణమును నుతించుచుఁ దన్నుఁ గృతార్థునిగా భావించు కొనియెను. అంత మైత్రేయుండు యథేచ్ఛంజనియె. విదురుండును నిండినతటాకంబువలె జ్ఞానపరిపూర్ణత్వముననిక్కి ప్రకాశించుచు మిగిలిన దివ్యతీర్థములనుగూడ సేవించుకొని రాగద్వేషాదులు లేనివాఁడయినను దనకు జ్యేష్ఠభ్రాతయును, రాజ్యాంధుఁడును, పుత్త్రశోకపీడితుండును, నేత్రవిహీనుండును, వృద్ధుండును నగు ధృతరాష్ట్రుని దుర్దశను మనమ్మునఁ దలంచుకొని జాలిపడి జ్ఞానోపదేశంబుచేసి యతని నెట్లయినను సంసారవిముక్తునిఁ జేయవలె నన్న తలంపుతో హస్తినాపురంబున కరిగెను.

## ౧౩

భారతయుద్ధము ముగిసెను. పదియెనిమిది దక్షౌహిణుల సైన్యమును బదియెనిమిది దినములలో మడిసెను. పాండవపక్షమునం బంచపాండవులును గృష్ణసాత్యకులును మిగిలిరి. కౌరవులందుం గృతవర్మ కృపాచార్యాశ్వత్థామలు మిగిలిరి. దుర్యోధనాదిపుత్త్రశతంబును సంహరింపఁబడెను. జరావస్థాపీడితుఁడగు ధృతరాష్ట్రుని కంఠస్థలమున మహాఘోరమగు పుత్త్రశోకదవానలము చుట్టును దరికొనెను. దానిని జల్లార్చుకొన నతనికి శక్యమా? అందుచేత నయ్యంధరాజు ఱెక్కలువిఱిగిన గరుడునిచందమున, తేజం బుడిగిన దివాకరునిరీతిని, శోకాతిశయంబున నిస్తేజస్కుండై పురపురం బొక్కుచుండెను. తాను రాజ్యలోభంబునం గుమారుని మందలింపక యుపేక్షించినందులకుం దగినట్లుగా నా ఘోరదుఃఖము సంప్రాప్తించుటచే నతఁడు మిక్కిలి పశ్చాత్తాపపడఁ జొచ్చెను. ఇట్లనవరతము పరితపించుచు నిద్రాహారములు విడిచి రూపొందిన దుఃఖంబు చందంబున ధృతరాష్ట్రుం డున్న సమయమున విదురుండు వచ్చి సందర్శించెను. నిస్తేజస్కుఁడయిన రాజును జూచి విదురుఁడు నిశ్చేష్టితుఁడయి జ్ఞానపరిపూర్ణుం డయ్యును నతని దురవస్థకు నించుక వగచి యతని దుఃఖ ముపశాంతి నొందింప నిట్లుపదేశించెను.

ఇట విదురుని యుత్తమత్వమును గొంత వర్ణింపవలసి యున్నది. లోకములో నుత్తములు తమవారి యపమార్గమునం జరించుచుండఁ జూచి మిగుల వగతురు. వగచి వారికిం

దగువిధముల హితోపదేశముఁ జేయుదురు. చేసి యప్పటికిని వారు సన్మార్గగాములు గానిచో మున్ముందు వారికి రాఁగల యాపదలను దెలిసి భయముఁ గొల్పుదురు. వీరిట్లు వర్తింపక తీఱదని శాసింతురు. అప్పటికిని వారు తమ వర్తనమును దిద్దుకొననిచో వారట్లు చెడి నశించుట దైవసంకల్పిత మని నిశ్చయించి తమ ప్రయత్నమునుండి మరలుదురు. మఱియు నుత్తములు తమ హితోపదేశంబును వినక చెడిపోయిన బంధుగులను గాంచి జాలిపడుదురు గాని వారా మూర్ఖులను గోపింపరు. ద్వేషింపరు. నిందింపరు. విదురుఁడు మొదటి నుండియుఁ బాండవవైర మనర్థదాయక మని వలదు, వలదని పలుతెఱంగులఁ జెప్పి బోధించెను. నిదర్శనపూర్వకముగాఁ గుటుంబకలహములవలని నష్టమును వెల్లడించెను. పెక్కు నీతుల నుపదేశించెను. కుమారుని బోధించి సంధి కొడఁబడు మని యతండు తన సోదరుని నిర్బంధించెను. అప్పటికి నతఁడు సన్మార్గప్రవిష్టుఁడు కా నందులకుఁ గురుకుల నాశము దైవ సంకల్పిత మని నిశ్చయించుకొని దుర్యోధనతిరస్కృతుఁ డయి తీర్థయాత్రాపరుఁడయి వెడలిపోయెను. అట్లయ్యుఁ దనమాట వినని రాజునందు గోపముంచక యుప్పు డతనికి సంప్రాప్త మయిన యాపదకుఁ జాలిపడి వెనుకటివృత్తము నింతైనఁ దడవక యతని నించుకైనను నిందింపక శాంతమనస్కుఁడై తొంటివిధమున నతనికి హితోపదేశ మొసఁగఁ దొడఁగెను. ఇదియే కదా యుత్తమలక్షణము. ఇట్టిమహనీయగుణగరిష్ఠుఁ

డగు విదురుఁడు దుఃఖోపశమనార్థము ధృతరాష్ట్రున కిట్లనియె

"ఓమహారాజా! వృద్ధి హానిని సూచించును. ప్రియ మప్రియముగా మాఱును. పుట్టుక చావును దెలుపును. సంయోగము వియోగమునకుఁ గారణమగును. ఇట్లగుట పదార్థముల నైజము. దానిని దప్పింప నెవ్వరికిని సాధ్యంబు గాదు. అసాధ్య మగుదానికి వగవఁ బనిలేదు. యముఁడు శూరుని సంహరించును. భీరుని సంహరించును. మానవుని చాతుర్యము, బుద్ధిబలము, దేహబలము, మొదలగునవి చావును దప్పింపలేవు. యుద్ధము చేసినగాని మరణము రాదని తలంపకుము. పుట్టిన వారికెల్లను జావు తప్పదు. కాలము తీఱఁగానే యందఱును మరణింతురు. ఆ గడువుకాలము నతిక్రమింప నెవ్వరికిని దరముగాదు. ఇట్టిదానికి నీ వింత మనోదుఃఖము నొందనేల? ఓమానవేంద్రా! నీకుమారులు యుద్ధముచేసి వీరశయనంబు నొంది యింద్రున కతిథులై స్వర్గంబున సుఖించుచున్నారు. గొప్పయజ్ఞము లొనరించినవారును, మహాదానము లొసర్చిన వారును, విద్యాధికులైన వారును, దపోనియమసంపన్నులును, బొందఁ దగినయుత్తమపదములను యుద్ధనిహతులగు వీరవరులుఁ గూడఁ బొందుదురని పెద్దలు చెప్పుదురు. అట్లే నీకుమారు లుత్తమపదవి నొందియుండఁగా విచారింపఁ బనియేమి? ఓసోదరా! ఈసంసారంబున మన కెందఱో తల్లు లయిరి. ఇం కెందఱో తండ్రులు గతించిరి. ఎందఱో సోదరులు మృతి జెందిరి. మఱెందఱో భార్యలు మడిసిరి. మఱెందఱో పుత్త్రులు

నశించిరి. ఇట్లు చచ్చినవారిలో నెవ్వరికి దుఃఖింతువో చెప్పుము. యౌవనమును, సౌందర్యమును, ప్రాణంబును, పదార్థసంచయములును నిత్యములు గావు. ఆ యనిత్యవస్తువులకై వగచుట పండిత లక్షణము గాదు. అట్టియెడ విజ్ఞానసంపన్నుడ వగు నీవిందులకు వగచుట న్యాయమా? ఓ రాజేంద్రా!

" యౌవనంబును రూపంబు జీవితంబు
ద్రవ్యసంచయములు ననిత్యములు గావె
వీనిహానికి వగ నవివేక మగుట
పండితులు వగఁ గూరరు కౌరవేంద్ర."

సంతతచింతవలన దుఃఖ ముద్రేకించును. దానివలన యుక్తాయుక్తవివేక ముడలి విహితకృత్యంబులలో నొక్కదాని నైనను నొనర్ప సమర్థుండు కాఁడు. కావుననే యార్యులు చింతను దొలఁగించుకొని తజ్జన్యమగు సంతాపమును నడంచికొందురు. ప్రియవస్తువియోగమువలనను, నప్రియసంభవము వలనను, బరిజ్ఞానరహితులకు నల్పబుద్ధులకు దుఃఖ మొదవును గాని పండితులకుఁ గాదు.

"ప్రియవస్తు వెడలుటయు న
ప్రియంబు వాటిల్లుటయుఁ బరిజ్ఞాన విని
శ్చయహీనులైన యల్పా
శయులకు దుఃఖంబుజేయు జగతీనాథా!"

కావునఁ బుత్రశోకజనితసంతాపమును జ్ఞానబలంబున నడంచుకొనుమని పల్కిన విదురునిఁ గాంచి ధృతరాష్ట్రుం డిట్లనియె: " ఓ విదురా! నీసుభాషితంబులవలన నాదుఃఖంబు

కొంతవఱకు డిందు పడియె. ప్రియవస్తువియోగంబునను, నప్రియసంభవంబునను, బండితులు దుఃఖంబు బొరయరని పల్కితివి. వా రట్లగుటకుఁ గారణం బేదియో తెలియఁజెప్పు?" మనవుడు విదురుం డిట్లనియె: "ఓ మహీంద్రా! ఈలోకం బంతయు నశ్వరమని గ్రహించి పండితులు దానియం దాసక్తులై యుండరు. అట్లాసక్తులుకానివారికి దుఃఖము లెట్లు గల్గునో యోజింపుము. ఆలోచింపఁ దనశరీరమే తన కెరవైనప్పుడు తక్కిన వస్తువులనుగూర్చి వేఱె చెప్పవలయునా? ఇట్లు సకలవస్తువులు ననిత్యంబులని గ్రహించిన బుధులకుఁ దద్వస్తువియోగమువలన దుఃఖ మెట్లు దగుంచునో యాలోచింపుము. ఓ రాజా! మానవుఁ డొకయింటిని విడిచి వేఱొకయింటిని బొందినవిధమున, నొకవస్త్రమును విడిచి వేఱొకవస్త్రమును ధరించుతీరున నాత్మ కర్మాధీనమగు నొక శరీరమును విడిచి వేఱొకశరీరము నొందును. ఆశరీర మెప్పుడును నశ్వరమైనదే కాని స్థిరమైనది కాదు. కులాలుఁడు కుండను జేయుటకై మృత్తికను సారెపై నిడును. అట్లిడినప్పుడే యొకవేళ మృత్తిక పగిలిపోవును. లేనిచో నామృత్తికను నేర్పుతోఁ బట్టలేకపోవుటచేఁగాని, లేక సిద్ధమైన ఘటమును బదిలముగా నొకచో నుంచలేకపోవుటచేఁగాని పగిలిపోవచ్చును. లేక ఘట మెండఁబెట్టినప్పుడుఁగాని యావమం దిడునప్పుడు గాని జనులు వాడుకొనినప్పుడుగాని, పగిలిపోయినఁ బోవచ్చును. అట్లే మనశరీరము పిండావస్థయందును, ప్రసూతియందును,

బాల్యమందును, యౌవనమందును, కౌమారమునందును, వార్ధకమందును, కర్మానుగుణమైన నాశంబు నొందుట సహజంబు. కావున శరీరమునకు నాశంబు నియమితమైనను నే యవస్థయం దది సంభవించునో నిర్ణయింపలేము. ఓ రాజా! నీపుత్త్రాదులు తమ తమ సుకృత దుష్కృతములను బురస్కరించుకొని శరీరంబులు విడిచి యుక్తస్థానంబులను జెందియుండ వారికై వగవంబనియేమి? ప్రాజ్ఞులు వివేకబలంబున సంసారంబు దుఃఖబహుళంబని యెఱింగి తద్దూరగమనమును సులభముగా ధరించి శాశ్వతసుఖంబు నొందుదు" రని పలుక ధృతరాష్ట్రుఁడు విని కొంత యూరటఁ జెంది విదురునిఁ గాంచి యిట్లనియె. "ఓ విదురా! నీ సముచితోక్తులవలన నామనంబు కళంకరహితమగుచున్నది. ఈ యాపద్దశయందు భవదీయ వచనామృత సేచనజలంబు లేకున్న నాగతి యేమి కావలయునో చెప్పవలయునా? కావున దుఃఖసంతప్తమగు నాచిత్తమునకు శాంతి యలవడునట్లు మఱికొంత ప్రసంగింపుము. సంసారమెట్లు దుఃఖబహుళమో, యది యెట్లు గహనతుల్యమో! వివరించి నాదుఃఖమును జల్లార్పు" మని యడుగ విదురుం డతని కిట్లనియె.

## ౧౨

### విదురుఁడు సంసార దుఃఖ బహుళ నిరూపణము తెల్పుట

"ఓరాజా! జీవాత్మ మొదట పిండాకారమై తల్లిగర్భంబునఁ బడి యట వర్ధిల్లుచుఁ గాలవశమున సకలావయవములు గల వాఁడై

గర్భనరక మనుభవించును. పిమ్మట నతఁడు ప్రసూతిమారుతము వలన నేలఁ బడును. అట్లు పడి యతఁడు గ్రహభూతాదులచే నానావిధ బాధల నొందును. అంత శైశవము గతించి బాల్యావస్థ నొంది చపలత్వమున వర్తించుచు శుద్ధాశుద్ధవస్తువుల నెఱుఁగఁ జాలక జుగుప్సితకార్యముల నొనర్చుచుఁ బలువురచేఁ జీవాట్లు దినును. పిమ్మట యౌవన మంకురింపఁగానే జీవి విషయ సుఖముల నపేక్షించి యింద్రియవశ్యుఁడై నానా నింద్యకార్యము లొనరించుచుఁ బలుకష్టములకు లోనై సర్వదా దుఃఖ మనుభవించుచుండును. అంతలో వార్ధక్యము పొడసూపును. అప్పు డతఁడు క్రొత్తరూపములందును. ఇంద్రియపాటవము దఱుగుటచేఁ గన్నులు గానరావు. చెవులు శబ్దమును గ్రహింప నోవవు. శరీరము ముడుతలుపడి దుర్బలమై వడవడ వడఁకును. కాలుసేతులు స్వాధీనములుగావు. ఇంతియేగా యతఁడు సర్వకార్యములందు నసమర్థుఁడై వర్తించును జరాదుఃఖ మొకవంక నతనిఁ బీడించుచుండ భార్యాపుత్రాదు లొకవంక నిందించుచు మిక్కిలి సంతాపము గల్గింతురు. అంత నతఁడు విచారంబునకు నానారోగములకును గుఱియై కాలక్రమమున మృత్యుపాశబద్ధుఁడై శరీరము విడిచి పరలోకమున కరుగును. కావున జీవి పుట్టినది మొదలు మరణించువఱకుఁ గల సర్వావస్థలయందును దుఃఖమునుమాత్రమే యనుభవించుచున్నాఁడు. ఇట్లుండఁ గొందఱు దుర్మతులు లోభక్రోధాదులకు వశులై సంసారమునందలి సుఖాభాసము నపేక్షించి యొకరినొకరు

వంచించికొనియు, నిందించికొనియు, భక్షించుకొనియుఁ జచ్చి ధర్మపథంబును దప్పి యమదూతల పాలయి నానావిధ దుఃఖముల నందుదురు. కావున సంసారమునందుఁ బ్రాణికి సుఖమెట్లు గల్గుచున్నదో యోజింపుము. అందువలననే దీనిని దుఃఖబహుళమని పండితులు వాకొనిరి. కొందఱుత్తములు పండితులవలన సంసారతత్త్వమును దెలిసికొని దానియం దాస్థమాని విమలస్వాంతులై సన్మార్గంబున వర్తించుచు నిత్యానందస్వరూపు లయ్యెదరు. ఓ సోదరా! ఈ యంశమును మనమునఁ బట్టించుకొని యనిత్యవస్తువులనుగూర్చి దుఃఖము విడువుము. ఇఁక సంసారము గహనతుల్య మెట్లయినదో వివరింతును. వినుము :

### విదురుఁడు సంసారగహనంబు తెలియఁ గెలిఁగించుట

"ఓ మహారాజా! అతి సాంద్రంబును దుర్గమంబు నగునొక మహారణ్యము గలదు. ఒక పాంథుఁడు దానఁ బడిపోవు చుండఁగా కరికురంగసింహశార్దూలశరభాదులగు క్రూరమృగంబు లాతనికి గోచరించెను. వానిని గాంచి యాబాటసారి మిగుల భీతుఁడై మార్గాయాసమున వికలాంగుఁడై ధైర్యము వదలి యెటుబోవను దోఁచక మట్టాడుచుండ నాతనికి దొంగల గుంపొకటి తారసిల్లెను. అట్టియెడ వానియవస్థ యెటు లుండునో యోజింపుము. వానిశరీరము గడగడ వడఁకు చుండెను. అడుగులు తడబడుచుండెను. శరీరము గగుర్పాటు చెందెను. నోట మాటరాకుండెను. వాని ప్రాణములు మీఁది

కెగిరిపోయిన ట్లయ్యెను. వాఁడు నలుదిక్కులు పొడగాంచెను.
తనకు రక్షకస్థల మెక్కడ నైనను లభించు నేమోయని
వెదకెను. కాని యేమియుఁ బ్రయోజనము లేకపోయెను.
ఏవంకఁ జూచిన నపారమగు మహారణ్యమును,
మృత్యుదాయకములగు ఘోరమృగములును, క్రూరహృదయు
లగు చోరులును మాత్రమే గానవచ్చుచుండిరి. అందుచే
వాఁడు పిడుగడఁచినట్లు చేష్టలుదక్కి నిలిచిపోయెను. ఆ మహా
రణ్యమున నెటు చూచినను వలయముగా నొడ్డినయురులు
గనఁబడుచుండెను. అంత భయంకరాకార యగు నొక యువిద
వచ్చి యతనిని గౌఁగిలించుకొనెను. వాఁ డందులకు మఱింత
భయమును చెందుచుండఁ బంచశిరంబులును, బర్వతాకారం
బులును నగు మత్తమేనుఁగు లనేకంబులు వచ్చి యచ్చట సంచ
రించుచుండెను. తత్ప్రదేశంబున నొక్క కూపంబుగలదు. అది
వల్లీవితాన సంవృతంబై సుగూఢంబై యుండెను. ఆ పాంథుఁడు
దాని నిజం బెఱుంగక పోయి యందుఁగూలి తలక్రిందై యొక్క
బలుతీఁగెను బట్టుకొని వ్రేలుచుఁ గొమ్మనంటి పెట్టుకొని యున్న
పనసపండువలె నుండెను. ఆకూపంబున భయంకరమగు పన్నగం
బొకటి యుండెను. అది నాలుక లార్చుచు నతనిఁ గవియు
చుండెను. ఆ నూతిదరి నొక్క మహావృక్షంబు గలదు. అది
శాఖోపశాఖల వర్ధిల్లి బహుపుష్పమయంబై యుండెను. నానా
వర్ణంబు లగు మధుకరంబు లందు భ్రమించుచు మకరంద
మానుచుండెను. ఈబాటసారి నూతినుండి పైనుండి రాలుచున్న

తేనెబిందువు లాస్వాదించుచు జీవనమును నిలువఁబెట్టుకొనుచు నుండెను. ఓ రాజా! అట్టి విషమావస్థయందుండియు నప్పురుషుండు జీవితేచ్ఛను వదలఁడయ్యెను. వానికిఁ బ్రాణాధారమగు వృక్షము నున్మూలించు తలంపుతో నాఱుతలలును, పండ్రెండు కాళ్ళును, కృష్ణశ్వేతవర్ణంబును గల మహాగజంబొకటి యరుదెంచెను. సితాసితంబులగు మూషికంబు లమ్మహీరుహంబున మూలంబును గొఱుకుచుండెను. ఒకవంక భీకర మృగంబులు, వేఱొకవంక దొంగలసిందు, మఱియొకవైపున బహుళముఖసర్పంబులు, నొక్కెడ నత్యుగ్రకామినియు, మఱి యొక్కెడఁ బంచశిరంబగు సామజంబును, భయము గొల్పుచుండినను, మూఁతితో నా కారుణదర్వీకరంబు దబదడి పెట్టుచుండినను, మహాగజంబును మూషికంబులును తనకు నాధారమగు వృక్షము నున్మూలింపఁ బాటుపడుచున్నను దన చిత్తంబు భయాతిరేకమునఁ జిందఱవందఱ లగుచున్నను నతఁడు జీవితాశ వదలఁడయ్యెను. ఓ మహీశా! సంసారబద్ధుఁ డగువాఁ డీబాటసారివంటివాఁ డని యూహింపుము. సంసారియు నిట్లే పలుబాధలఁ గుందుచుండియు జీవితాశను విడువఁడు. ఈయంశమునే చక్కఁగా వివరించెదను. వినుము. ఆదుర్గమారణ్యమే సంసారగహనము. క్రూరమృగంబులును, దొంగలును రోగంబులు. ఆ యుగ్రకామినియే జర. ఆ పంచశిరస్కంబులగు గజంబులే యింద్రియంబులు. ఆకూపంబుననున్న సర్పంబే యముఁడు. ఆ బాటసారి పట్టుకొనియున్నలతయే

జీవితాశ. ఆకూపతీరంబుననున్న మహీరుహంబే యాయువు. ఆ మహీరుహమును గూల్పవచ్చుసామజమే సంవత్సరంబు. తదీయశిరంబు లాఱును షడృతువులు. తత్పాదంబులు పంౘెండును మాసములు. తరుమూలమ్ము గొఱుకవచ్చిన సితాసితమూషికంబులు రాత్రిందివములు. మధుకరంబులే కామంబులు. ఆ మధుధారలే కామరసంబులు. ఆ మధు సంచయమే యాయువు. మానవులు దానియందానక్తులై వలుపాట్లు పడుచుందురు. కావున నీసంసారము దుర్గమా రణ్యమువలె మహాభయంకరమైనది. దీనిని దరింప సామాన్యుల కలవి కాదు. మఱియు నీసంసారమును జక్రముతోఁ బోల్తురు. చక్రము భ్రమించుచుఁ గ్రిందుమీఁదును, మీఁదుగ్రిందును నగు చందమున సంసారమున వర్తించువార లొకప్పుడు కష్టముల నొంది, తదుత్తరక్షణముననే సుఖాభాసము నందుదురు. అట్లే యొకప్పు డున్నతులై వెంటనే యధము లయి వర్తింతురు. సామాన్యముగా మానవులందఱును సంసారపాశబద్ధులై విడువనేరక క్లేశంబునందలి పుర్వువిధంబున ముక్తిమార్గము గానక యుండే కుంది నశింతురు. సంసార చక్రపరిభ్రమణమ్మును నిలిపివేయుటకును, సంసారపాశములను ద్రుంచుటకును వివేకవంతులుమాత్రమే సమర్థు లగుదురు. తక్కినవారట్లు కారు. కావునఁ బుత్రశోకమునువిడిచి వర్తింపు మన విని ధృతరాష్ట్రుం డిట్లనియె. "ఓ విదురా! నీ మన మతి . నిర్మలమైనది. నీ చిత్తవృత్తి మిక్కిలి పవిత్రమైనది.

నీహారకణములు సుజనసందర్శనములు. నీ హితవచనములకు మిగుల సంతసించితిని. నా సందేహములకు తృప్తికరముగ సమాధానమిచ్చితివి. ఇంకను సముపదేశ మొసంగింపుము. దుఃఖసాగర మగ్నుండనగు నను సముద్ధరింపు" మని పలుకగ విని విమలుం డిట్లనె శిష్యునితో. "ఓ రాజేంద్రా! మన యింద్రియములకు వశవర్తుల మగుచున్నామని దుష్టసంకల్పములను గోలు విషయ ప్రపంచమునం బడి మునుఁగుచుఁ దేలుచు నుందుము. అంతకాలము క్రమముగా గతించ రోగంబులు జరయు నొకటం బ్రాణా నాక్రమించి దుర్భరబాధలను గల్గించుచు శరీరపాటవమును, సౌందర్యమును, నశింపఁజేసి మృత్యుగ్రాసముపాలు గావించును. ఓ రాజేంద్రా! మన శరీరము రథము వంటిది. దీనికి బలమే సారథి. ఇంద్రియములే యశ్వములు. దారుణాకారమగు బుద్ధి వ్యాపారములే దానికిఁ బగ్గములు త్రాళ్ళు. వానితో నా గుఱ్ఱములను నడిపింపక యథేష్టముగ నవి గొనిపోయిన విధమునఁ బోయినచో మానవుఁడు సంసారబద్ధుఁ డగును.

"తనుశరీరము దానికి
సారథి సత్వంబు తురగ చయ మింద్రియముల్
దారుణతర బుద్ధివ్యా
పారంబులు దనరు జనుపగ్గము లధిపా"

ఓ రాజా! కావున మానవుఁడు తన వివేకంబు పెంపున నింద్రియాశ్వములను స్వేచ్ఛగాఁ బరువెత్తనీయక లోఁగదీసుకొని వానిని తన యిష్టమార్గమ్మునఁ ద్రిప్పుకొనఁగలిగినచో సంసారసంబంధులగు సకల దుఃఖములును నిరసింప సమర్థుఁ

డగును. అట్టి మహానుభావుఁడే యముని కధీనమైనదియు ననేక దుఃఖజనకంబును నగు నీ కళేబరరథమును విపుల వివేక మనెడి మహాపథంబున నడిపించి సుఖించును.

“ యమునిగాధీనం బిది యు
ననుఁ బనేకములఁ జేయఁగా నొప్పు నృపా
త్తను యూరథ మనియించుచు
విమలవివేకాశ్వములను విను మార్యజనుల్.”

మఱియు బుద్ధివ్యాపారంబులనెడి పగ్గములను శీలంబను వెఱవుతో నలవరించి తీవ్రతరవేగం బార్యు లుడిపికొని జనన మరణాదులవలని భయంబు మజ్జగించి పరమసుఖంబు నొందుదురు. ఓరాజా! నీవును మదీయోపదేశములను మనంబునఁ బట్టించుకొని దుఃఖంబును దొలంగించుకొని శాంతచిత్తముతో యుద్ధంబునఁ గూలిన పుత్త్రాదిజ్ఞాతుల కందఱకును నుత్తర క్రియలు గావింపుమని బోధించెను.

ఆపత్సమయంబున దుఃఖభాజనంబగు మానసమును విమలము గావించి విజ్ఞానబీజంబు లంకురించిన ట్లిట్టి యుత్తమ సదుపదేశమును విదురుఁడు దక్క నితరు లెవ్వ రట్లుపదేశింపఁ గలరు? ఇట్టి జ్ఞానబోధకములగు వాక్యపాశములచేఁ బంక బహుళంబగు సంసారాంధువునుండి ధృతరాష్ట్రు నుద్ధరింపఁ బ్రయత్నించి విదురుఁడు తన విహితకృత్యములను నెఱవేర్చుకొనియె, కాని పుత్త్రశోకాతురుఁడును మలినమనస్కుఁడును నగు ధృతరాష్ట్రుండు తత్త్వల ముందనేరక విదురుం డుదివల్కిన

సంజయుండును గుంతీదేవియు నా దంపతుల ననుసరించి పోయిరి. అటఁ బ్రత్యేకముగ నాశ్రమంబులు గల్పించుకొని తపంబు సేయ నారంభించిరి. అందు విదురుండు నిశ్చల సమాధినిష్ఠుండై మునీంద్రులుసూచి యాశ్చర్య పడునట్లు తపంబొనరింప సాగెను.

ఆశ్రమవాసులైన ధృతరాష్ట్రాదులను జూచిపోవుటకై ధర్మరాజు తగుపరివారంబుతో వచ్చి యచ్చటివారి నందఱను జూచి కుశలంబడిగి విదురుఁ డేడీ యని యడుగ వృద్ధరాజిట్లు లనియెను. "కుమారా! మేమందఱము సుఖంబునకు సమర్థులమై యున్నాము. కాని మాలో విదురుఁ డొనర్చు తపం బత్యద్భుతంబు. అతఁడు మమ్ముఁ బాసి యిచ్చటికి సమీపము నందే యాశ్రమము గల్పించుకొన్నాఁడు. అతని తపంబుజూచి మునిశ్రేష్ఠులుగూడ నచ్చెరువందుచున్నారు. ఆ మహాత్ముఁ డెప్పుడును జలమును గాలిని మాత్రమే యాహారముగాఁ గైకొనును. ఒకప్పుడవియును విసర్జించి గాఢనిష్ఠాపరవశుఁడై, వర్తించును. అతఁడు స్వతంత్రుఁడై ధైర్యసహితుఁడై శూన్య విపినమున సంచరించుచున్నాఁ" డని నుడివెను. ధృతరాష్ట్రుఁడు పల్కిన వచనములే విదురుని యద్వితీయ తపోయోగ నిష్ఠను వెల్లడించుచున్నవి.

విదురుఁడు యోగబలమున దేహమును విడుచుట

యుధిష్ఠిరుఁ డందుల కానందించుచు నతనిని సందర్శించు తలంపులతో నుండ విదురుఁ డప్పుడే యాతని కడఁ బ్రత్యక్ష మయ్యెను. దిగంబరుండును జటీభూత కేశపాశుండును గాంతార

ధూళిమలినాంగుండును నై వచ్చి యాశ్రమవాసులను గాంచి మగిడిపోవుచుండ ధర్మరాజొక్కరుండును నతని వెంబడించి చనియె గుల్మాంతరితుండగుచు నవ్విదురుండు పోవంబోవ నప్పాండవాగ్రజుం డెలుగెత్తి "ఓ విదురా! నిలువుము. నిలువుము. నేను ధర్మజుండను. నీ సందర్శనార్థంబు వచ్చితిని. నిలువు" మని ప్రార్థించుచుఁ బరువెత్తఁగా నవ్విదురుండు వెనుదిరిగి ధర్మజుని బొడఁగాంచి యొక్క వివిక్తప్రదేశంబున నొక్కపాదపంబుచెంత నిలువంబడియెను. అంత ధర్మరాజతని సమీపించి కట్టెదుట నిలిచిన నతం డతని నర్ధనిమీలితనేత్రంబులతోఁ జూచి యూరకుండెను. అపుడు ధర్మజుఁ డతనిఁ జూచి "ఆర్యా! నేను ధర్మజుండను. నాయందు దయయుంచి నన్నుఁ జూడు" మని ప్రార్థించెను. విదురుఁ డప్పలుకులు విని గనుఱెప్ప లొకపరి విచ్చి యతనిని జూచి యుదాత్త యోగబలమును గైకొని కర్మశరీరమును విడచి తేజోమయ భావంబున ధర్మరాజు శరీరంబునఁ బ్రవేశించె. ఆ సమయమున ధర్మరాజు దేహంబు కాంతిబహుళమై మిక్కిలి వర్ధిల్లి ప్రకాశింపఁదొడఁగె. తదనంతర మయ్యుధిష్ఠిరుం డవ్విదురుని నిర్యాణమున కచ్చెరువందుచుఁ దదీయశరీరంబున కగ్నికార్య మొనర్ప నెంచియుండ "ఓ ధర్మరాజా! యతీశ్వరుఁ డగు విదురుని శరీరమున కగ్నికార్యం బొనర్చుట తగదు. నీ ప్రయత్నము నమానుము, మాను" మనెడి వాక్కు వినఁబడ నతఁ డాశ్చర్యచకితుండై యటనుండి మరలి తనవారిం జేరి విదురుని వింతచర్య వారల కందఱకు నెఱిఁగించెను.

ధర్మదేవత యవతారమగు విదురుండు తన సత్ప్రవర్తనముచేతను సద్గుణగణంబుచేతను జ్ఞానబలంబుచేతను నీతి విశారదత్వమునందు సుప్రసిద్ధుండై లోకమునకు నిదర్శన భూతుండై సర్వజనశ్లాఘాపాత్రుండై వర్తించెను.

మహామహుం డయిన విదురుండు గృహస్థాశ్రమమును గైకొనియు జనకాదులవలె సంసారాసక్తుండు కాక యావజ్జీవమును పితృసముం డగు సోదరుని గొలిచి తన సౌభ్రాత్రమును వెల్లడించెను.



యీ గ్రంథకర్తగారి యితర రచనలు

| | | | | |
|---|---|---|---|---|
| లక్ష్మీప్రసాదము | (సాంఘికనవల) | డెమ్మీ | 346 పే. | రు 2-0-0 |
| రాజసుందరి | (సాంఘిక నవల) | డిటో | 256 పే. | రు 1-8-0 |
| ఆనందభాయి | (చారిత్రిక నవల) | డిటో | 276 పే | రు 2-0-0 |
| అగ్రహారము | (సాంఘిక నవల) | డిటో | 264 పే. | రు 1-8-0 |
| రాజ్యలక్ష్మి | (సాంఘిక నవల) | డిటో | 196 పే. | రు 1-8-0 |
| రహస్యభేదనము | (డిటెక్టివు నవల) | డిటో | 210 పే. | రు 1-8-0 |